


సచిత్ర మాస పత్రిక

7 A. శివాజీ స్ట్రీట్

టి. నగర్. మద్రాసు-17.

విడి ప్రతి వెల :

ఒక రూపాయి

ఏడాది చందా

పన్నెండు రూపాయలు

సంపుటి 11

మార్చి 1973

సంచిక 2

సంస్థాపకులు :

శ్రీ. కే. వి. వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్ :

శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

అసోసియేట్ ఎడిటర్:

వ్యాస్‌చంద్

Edited & Published by V. Leelavaty Raghavaiah, 7-A, Sivaji Street, Madras-17 and Printed by B. V. Narasimha Rao, at Sri Krishna Chitra Printers 7, NageswaraRao Road, Madras-17 Associate Editor: Vyaschand




ముఖ చిత్రం :

దీపి ఇంటర్ నేషనల్ వారి

"దేశోద్ధారకులు"



రామవిజేతా ఫిలింస్

# రామరాజ్యం

లక్ష్మీ ఫిలింస్ రిలీజ్

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం కె.బాబూరావు • నిర్మాత కె.ఎ.ప్రభాకర్

# తొలిమాట

రైళ్ళ రాకపోకలు సరిగా లేనందువలన ఫిబ్రవరి సంచిక ఆపుజేసి మార్చి సంచిక విడుదల చేస్తున్నాము. ఈ విషయం పాఠకులు, ఏజంట్లు, ప్రకటనదారులు గ్రహించ ప్రార్థన.

*                 *                 *

ఈనెల ఉత్తరాల శీర్షికలో ప్రచురితమైన రచయిత శ్రీ వల్లూరి విజయకుమార్ గారి జవాబు మాకు తృప్తి కలిగించింది. పాఠకులు కూడా మాతో ఏకీభవిస్తారనుకొంటాము.

[signature]

పద్మనాభం సమర్పించు 1000 నవ్వుల హాస్యచిత్రం

రేఖా & మురళీ ప్రొడక్షన్స్

# ఆజన్మ బ్రహ్మచారి

నిర్మాత
బి. పురుషోత్తం

స్క్రీన్‌ప్లే - దర్శకత్వం
పద్మనాభం

సంగీతం ఎస్.పి.కోదండపాణి






ఎడిటర్‌గారికి—

యివాళ అనుకోకుండా జ్యోతి చదవటం తటస్థించింది. అలవాటు ప్రకారం తొలిమాటతో ప్రారంభించాను. అందులో రామచిలకని గురించిన విమర్శ చదివాక విస్మేరపోయాను. ఉత్తరాలద్వారా చలి - చీకటి అబ్బాయి నవంబరులో ప్రచురితమయిందని గ్రహించాను. నేను నెల్లాళ్ళుగా టూరింగ్‌లో వుండటం మూలాన కథలు చదవగలిగేంత టైంలేకపోయేది.

పాకల సీతగారు రాసిన వుత్తరం నాకు దిగ్భ్రాంతి బాధ కలిగించింది. ప్రచురితమయిన కథలనే ప్రచురించటాని కిచ్చేంత మూర్ఖుడిని ఆశపోతునూ కాను. తొలిమాటలో మీరు నామీద ఘాటయిన విమర్శనచేసి కర్తవ్యాన్ని నెరవేర్చారు. కానీ మీరు బాగా యెరిగిన వ్యక్తి యిలా చేస్తాడని యెలా అనుకుంటున్నారు! దానికి కారణం వుందో లేదో అనే ఆలోచన లేకుండా ఒకే కథని పలుపత్రికల్లో ప్రచురించుకోవాలనుకుంటున్నట్టు భావించేసారు. అది నా దురదృష్టం.

మీకు మీ ద్వారా పాఠకులకి నేను చెప్పాల్సిందొక్కటుంది. 1970 లో నేను రామచిలక కథ వ్రాసాను. తర్వాత నరస సంపాదకుని కలిసాను. ఆయన తర్వాత చెబుతానని అన్నారు. ఇది 197- ఆగస్టు లేక సెప్టెంబరు నెలల్లో జరిగుంటుంది. తర్వాత 1972 లో మీరు ప్రచురిస్తున్నట్టు చెప్పారు. వెంటనే నరస సంపాదకులని కల్సుకోవాలని వెళ్ళాను ఆయనలేరు. నా కథ గురించి అక్కడే పనిచేసే ఒక వ్యక్తి పెండింగ్ ఫైల్లో చూసి కథని సెలక్టు చెయ్యలేదన్నారు.

కథని తిరిగివ్వమని కోరాను. అది దొరకలేదు. వారికి యీ కథని మీరు ప్రచురిస్తున్నట్టు చెప్పి నా కర్తవ్యాన్ని నెరవేర్చాను. తర్వాత ఆగస్టు 72 లో మీరు ప్రచురించారు.

కానీ యిప్పుడే తొలిసారిగా 1971 జూలైలో నరసలో ప్రచురించబడ్డట్టు పాకల సీతగారి లేఖ ద్వారా తెలిసింది. ప్రచురించిన వారు కనీసం ప్రతి కూడా పంపలేదు. ఇలాగే 1970 లో 'భరించలేని జాలి' కథని వొలి కేకకి పంపాను, నాకా పత్రిక ప్రతి 1971 సెప్టెంబరులో వచ్చింది దాని మీద 1971 జూన్ అని ముద్రితమయి వుంది. ఇప్పుడా పత్రికే లేదు. పొరపాట్లు జరుగుతాయి. కానీ నా మీద అభిమానం వుంచిన పాఠకులని సంపాదకులని నేను మోసం చెయ్యను, చెయ్యలేను.

పాఠకులు మీరు ఆలోచించి నా కథలు పత్రికలలో ప్రచురించుకోవాలన్న కోరికున్నదని భావిస్తే తప్పు నాదే అని నిర్ణయిస్తే—నేను వెంటనే రచయితగా విరమిస్తాను. దయచేసి నన్నెరిగిన నా పాఠకులు సంపాదకులు తప్పక జవాబివ్వగలరని పత్రికా ముఖంగా యెదురు చూస్తూ

—వల్లూరి విజయకుమార్




ఆంధ్ర జ్యోతి వీక్లీ తిరగేస్తున్నాను. కొత్త కెరటాలులో ఎవరో రచయిత్రి గురించి పడింది. ఆంధ్రుల అభిమాన రచయిత్రిట. నేనూ ఆంధ్రుణ్ణే! కానీ ఒక్క తెలుగు పుస్తకం కూడా చదివిన పాపాన పోలేదు అందుకే ఆవిడ అభిమానుల్లో చేరలేకపోయాను. ఒక్క క్షణం ఆవిడ ఫోటోవైపు చూశాను. క్రింద ఆవిడ గురించి రాసిన వాక్యాలు బావున్నాయి దిమోస్ట్ గ్లామరస్ రైటర్ ఇన్ తెలుగూట. సంచలనం కలిగించే నవలలు రాసిందిట! సస్పెన్స్‌తో పాఠకులని ఉర్రూత లూగిస్తుందిట!

అంత గొప్పపేరు సంపాయించుకున్న ఆవిడ మీద నాకు కాస్సేపు జెలసీ వేసింది? అన్ని నవలలు ఎలా రాయగలదో అనిపించింది నాకు. నాటకం పెట్టాలి చేసే బద్ధకం! ఒక్క ఆ రచయిత్రి మీదే కాదు అన్ని రంగాల్లోనూ పేరు ప్రఖ్యా

తులు పొందుతున్న వాళ్ళంటే-ఎందుకో తెలియదు గానీ నాకు జెలసీ వేస్తుంది ఘంటసాల గొంతు రేడియోలో విన్పి స్తూంటే తాయారు సర్వం మర్చిపోయి రేడియోలో అతుక్కుపోతుంది అలాంటి సమయాల్లోనూ—నేను కాలేజీలో చదువు కునేటప్పుడు ఆడపిల్లలు రాజేష్ ఖన్నా అంటే వెర్రెత్తిపోయేవారు అలాటప్పుడు,

మా ఫ్రెండ్సంతా కిషోర్ కుమార్ ఆరాధకులు। కిషోర్ రికార్డ్స్ ఒక్కటి కూడా వదలకుండా కొనేస్తారు-అప్పుడూ

ఇలాగే నేను ఘంటసాల, రాజేష్ ఖన్నా, కిషోర్‌కుమార్‌ల మీద, విపరీతంగా జెలసీపడేవాణ్ణి. నేనే వాళ్ళయి వుంటే బావుండేది అన్పించేది. ఇప్పుడిప్పుడు నాకు శతృఘ్న సిన్హామీద కోపంగా వుంది. ఎందుకంటే మా క్రింది అంతస్థులో ప్రొఫెసర్ గారమ్మాయి ఈ మధ్య అతణ్ణి గురించే కలవరిస్తూందిట। ఆ అమ్మాయేకాదు మొత్తం దేశం లోని అమ్మాయి లందరూ। మొన్న స్టార్ అండ్ స్టయిల్ లో అతని ఫొటో చూశాను పెద్దబొమ్మ వేసి ఆడపిల్లలు అతని చేతులమీంచి, కాళ్ళ మీంచి వేళ్ళాడుతున్నట్టు వేశారు అంత అభిమానంట ఆడపిల్లలకి అతనంటే। ఇంక అతను గొప్పలు కొట్టడం కూడా అలాగే వుంది తను తప్పకుండా యింటర్నేషనల్ స్టార్ అయితీరుతాడట.

నాకు అతన్ని అభిమానించే అమ్మాయిల మీద వెర్రికోపం వచ్చింది ఈ అమ్మాయిల కసలు బుద్ధిలేదు వాళ్ళ వెనక పడ్డానికి। ఛ ఛ। వాళ్ళ విలువ వాళ్ళే పోగొట్టు కుంటున్నారు అనుకున్నాను.

నా ఆలోచన్లు తాయారు వైపు మళ్ళాయి గోడ గడియారం ఎనిమిది చూపిస్తోంది తాయారు మార్నింగ్ వాక్ నుంచి ఇంకా తిరిగిరాలేదు. ఒక్కో వయసులో ఒక్కో రకంగా మార్పులు వస్తూ వుంటాయి మనిషి శరీరంలో। అది సహజం। పెళ్ళికి ముందు సన్నగా గాలి వీస్తే ఎగిరిపోయేలా వుండే తాయారుకి నాతో పెళ్ళయ్యాక ఏడాదికే బాగా ఒళ్ళొచ్చేసింది, నేనేం దానికి పట్టించుకోలేదుగానీ తాయారు మాత్రం పెద్ద రాద్ధాంతం చేసేస్తోంది

అసలు దానిది విచిత్ర స్వభావం. అది అమాయకత్వమో, వెర్రో, నాకే అర్థం కాదు ఒక్కోసారి। తాయారు హిందీ సినిమా తారల ఆరాధకురాలు। వాళ్ళల్లా వుండాలని తెగతాపత్రయ పడుతుంది ప్రపంచం అడవిలాంటిది. అందులో గంధపు చెట్లూ వుంటాయి అడవి మామిలూ వుంటాయి. కావాలంటే మాత్రం అడవి మానుకి సుగంధం వస్తుందా। తాయారుకి హిందీ స్టార్స్ లావణ్యం వస్తుందా?

"నువ్వు సినీస్టార్‌లా లేకపోయినా, నాకు నువ్వంటే ప్రాణం। అని నచ్చ

చెప్పినా తాయారు వినిపించుకోలేదు. పోనీ ఆ చేసే డైటింగ్ సక్రమంగా కూడా చెయ్యదు. అన్నం తగ్గించిందికానీ చిల్లర తిళ్ళు విపరీతంగా పెంచేసింది. విటమిను టాబ్లెట్స్ కాకుండా, బలం అని పొద్దున్నా సాయంత్రం, నాలుగేసి గోధుమ రొట్టెలు పావుశేరు పాలు తాగుతుంది, రాత్రిఅరటి



యాపిల్ మొదలైన పళ్ళు। వీటివల్ల విపరీతంగా పెరిగిపోతున్న శరీరం తగ్గడానికి రోజూ ఎక్సర్‌సైజు క్రింద మార్నింగ్ వాకు. అవీ తాయారు పద్ధతులు। శరీరం తగ్గడానికివేరే ఎక్సర్‌సైజు చెయ్యక్కర్లేదు. ఆడవాళ్ళకి ఇంటిపనే ఎక్సర్‌సైజ్!" అనిచెప్పాను ఓసారి. వినలేదు సరిగదా నన్ను తినేసేటంత తీవ్రంగా చూసింది.

మాకు వంటకి ఇంటిపనికి, బట్టలు తకడానికి వేరేవేరే ముగ్గురు పని వాళ్ళున్నారు. తాయారుకి పనిచేస్తే ఎక్కడ నీరసించి పోతానోనని భయం। ఓసారి వంటవాడు రాకపోతే వంటలో నాకు సహాయం చేసినందుకు ఆ సాయంత్రం పాలుకాసిని ఎక్కువ తాగి, రెండ్రోజులు రెస్టుతీసుకుంది, ఇంక శరీరం పెరగదూ మరి?

తొమ్మిదిన్నరకి నేను భోజనంచేసి,

యూనివర్సిటీకి వెళుతూండగా. వచ్చింది తాయారు. మొహం పేలవంగా. దిగులుగా వుంది. తాయారు వైపు సరిగా చూడని నేను టై కట్టుకుంటూ అడిగాను.

“ఏం డియర్! ఇంత లేటయింది? మర్చిపోయి ఆ జ్యోతిలో జోక్‌లా ఆనకాపల్లిదాకా వెళ్ళిపోలేదుకదా కొంపతీసి!”

సన్నగా ఏడుస్తున్న శబ్దం వినిపించింది ఉలిక్కిపడి వెనక్కి తిరిగాను తాయారు తప్పుచేసినదానిలా కొంగునోట్లో పెట్టుకుని వెక్కివెక్కి ఏడుస్తోంది.

“అరె! ఏమైంది?” నేను ఒక్క ఒక్క అంగలో తాయారు దగ్గరికి వెళ్ళాను టై పక్కన పడేసి నేను అడగడమే ఆలస్యం తాయారు భోరుమంది

“ఏమిటా ఏడుపు పిల్లీగా! ఏమైంది?” తాయారు మొహంపై కెత్తాను. వెక్కిళ్ళ మధ్య తాయారు చెప్పిన మాటలకి, నాకు కోపం, నవ్వూ రెండూ వచ్చాయి. తెలవారుజామున నాలుగున్నరకి తాయారు మార్నింగ్‌వాక్‌కి బీచ్‌వెంబడి వెడుతుంటే ఎవడో దొంగ కత్తిచూపించి మెడలోవీ చేతులవీ నగలన్నీ మంగళసూత్రంతో సహా తీసేసుకున్నాడుట. ఆ తర్వాత నాకు తెలిసిన విషయమేమంటే ఇరవై మూడో నెంబరు ఇంటి వాళ్ళింట్లోకూడా తెల్లవారుజామున ఎవడో దొంగ కన్నం వేశాడుట. నయమే. తాయారుని ప్రాణాలతో వదిలాడు. నేను నిట్టూరుస్తూ తాయారుతో ఓదార్పుగా అన్నాను.

“పోతే పోయాయిలే వెధవ నగలు! ఆ కత్తితో ఆ వెధవ పొడిచివుంటె ఏం చేసేదానివి?”

తాయారు కళ్ళముందు ఆ దొంగ మెదిలాడేమో, భయంతో నన్ను కరుచుకుపోయింది. భుజాలుపట్టి దూరంగా నెట్టాను. నాకు బాగా కోపం వచ్చింది.

“వెధవ ఎక్సర్‌సైజులు మానెయ్! ఆడదానివి ఒక్కత్తివీ ఆ చీకట్లో ఛఛ! నువ్వు మనిషివికాదు. బుద్ధివుంటే ఇలా ప్రవర్తించవు. ఇంకనుంచీ ఆ ఎక్సర్‌సైజ్ నువ్వు చెయ్యడానికి వీల్లేదు” అన్నాను ఖచ్చితంగా! తాయారు నావైపు భయంగా చూస్తుండిపోయింది. నా కళ్ళముందు ఆ దొంగ. తాయారు, బీచ్ వాకింగ్ మెదిలాయి.

* * *

రెండ్రోజులు వాకింగ్ మానేసినందుకు తాయారు విలవిలలాడిపోయింది. తన శరీర లావణ్యం తగ్గిపోయినట్లు దిగులుపడిపోయింది! ఈ మధ్య విజయచిత్రలో జయలలిత, జీనత్ అమన్ మొదలైన స్టార్స్ ఆడవాళ్ళకి అందంగా వుండడానికి కొన్ని ఎక్సర్‌సైజుల గురించి రాశారు. ఏదో పెన్నిధి దొరికినంత సంబరపడిపోయింది తాయారు. నేనే లేకపోతే ప్లేన్ టిక్కెట్టు కొనుక్కుని వెళ్ళి

ఆ జయలలితకీ. బొంబాయిలో జీనత్ అమన్‌కి పాదనమస్కారాలు చేసివచ్చేదేమో! వాకు ఆ స్టార్స్‌మీద ఒళ్ళు మండిపోయింది. అవి వాళ్ళు రాసినవి కావనీ. వాళ్ళ సెక్రటరీలు రాసినవనీ తాయారుకి చెప్పినా మానదు. నా కోపం భగవంతుడు వింటాడా? మర్నాడు తాయారు ఎక్సర్‌సైజు మొదలెట్టింది. వాటిల్లో స్కిప్పింగ్. శిరసాసనం ముఖ్యమైనవి. నిజంగా ఈ రెండు ఎక్సర్‌సైజులూ మంచివే. శిరసాసనం వెయ్యడం వల్ల రక్తప్రసారం బాగా జరుగుతుంది.



అంతా మాగ్‌జైన్స్‌మీదకి మళ్ళింది. పనీ పాటా లేకపోతే సరి ఇలాటి శీర్షికలు వెయ్యడానికి! తాయారులాటి ఇల్లాళ్ళకి అవి చూస్తే వికట బుద్ధులు పుడతాయని వాళ్ళకి తెలియదా?

నా గోడు తాయారే వినలేదు. ఇక రక్తం తలక్రిందులుగా ప్రవహించడం వల్ల. నరాలన్నీ ఉత్తేజంగా ఉండి కొత్త ఉత్సాహం పుట్టుకొస్తుంది. అది వేసిన పదినిమిషాలవరకూ తల భారంగావుంటుందికానీ. ఆ తర్వాత హాయిగా వుంటుంది. చక్కగా నిద్రపడుతుంది.

తాయారు పడగ్గదిలో సామాన్లన్నీ ఓ మూలకి జరిపేసి, గోడదగ్గర తలగడా వేసింది. తలుపులు వేసుకుంటూ నన్ను చూసి ఓసారి వెక్కిరించింది. నేను నవ్వాను. నా చిరునవ్వు రెండునిమిషాల్లో చెరిగిపోయింది. పడగ్గదిలో ధబ్‌మన్న చప్పుడు వినిపించింది. ఏదైనా క్రింద పడిందేమో! నేను అలాగేకూర్చుని కిటికీలోంచి ఎండలో వెండిలో తళతళా మెరుస్తూ, దూరంగా కన్పిస్తున్నసముద్రం వైపు చూస్తున్నాను. క్రింద మెట్లమీంచి ప్రొఫెసర్‌గారమ్మాయి కాలేజీకి కాబోలు వెళ్ళడానికి దిగుతోంది. క్రింద రోడ్డు మీద ఏలంరంగుకారు ఎండలో మెరుస్తోంది. బీచ్ మా యింటికి చాలా దగ్గర వడంవల్ల ఇరవైనాలుగు గంటలూ సముద్రపు హోరు విన్పిస్తూనే ఉంటుంది. తుఫానులాంటి గాలివాన వచ్చినప్పుడయితే ఈ యూనివర్సిటీస్టెడ్ క్వార్టర్సులో వుంటున్న నాలాంటి వాళ్ళకి గుండెలు పీచుపీచుమంటాయి. ఆ తుఫానుకి సముద్రం పొంగి ఇళ్ళని ముంచేస్తుందేమోనని భయంవేస్తుంది. సాధారణంగా యూనివర్సిటీ క్వార్టర్స్ అన్నీ రెండేసి అంతస్థులు. మాకు పై వాటా ఇచ్చారు. అలాంటి వాన సమయాల్లో మా పైభాగం కూలిపోతుందేమో క్రిందకి వెళ్ళి నుంచోవాలనిపిస్తుంది. ఆ వాన తగ్గేవరకూ కాలూ-చెయ్యీ ఆడదు. తర్వాత మామూలుగా ఎండొచ్చాక, నా ఆలోచనంతకి, నా భయానికి సిగ్గువేస్తుంది నాకు!

గదిలోంచి మూలుగు వినిపించింది. తృళ్ళిపడి తలుపుదగ్గరకి పరిగెత్తాను. గబగబ తలుపుతట్టాను.

"తాయారూ! తలుపుతియ్యి!"

"లేవ లేకపోతున్నాను" ఎక్కెక్కి ఏడుపు వినిపించింది. నాకు కంగారుతో మతిపోయింది. తాయారే క్రిందపడిపోయింది. ఏ చెయ్యో విరిగిపోలేదుకదా! తలుపు విరక్కొట్టేలా తోశాను. తలుపు తెరుచుకుంది. తాయారు శవపానంవేస్తూ క్రిందపడిపోయింది వెల్లకిలా పడిపోతూ భయంతో చెయ్యితో నేలని ఆసరాగా చేసుకోబోయిందిట! కుప్పలా మూలపడి వుంది. ఆచెయ్యి ముట్టుకు చూశాను కెవ్వుమనిఏడ్చింది ఆచెయ్యి కదపలేక పోతోంది. బాధతో ఏడుస్తోంది. కోపం తెచ్చుకోవల్సిన సమయంకాదది. ఒక్కక్షణం అలాగే తాయారువైపుచూసి ఒక్కంగలో కిటికీదగ్గరకి నడిచాను.

ప్రొఫెసర్ గారమ్మాయి కారులో ఎక్కికూర్చుంటోంది గట్టిగా చప్పట్లు చరుస్తూ పిలిచాను. ఆ అమ్మాయి ఆగి తల పైకెత్తి నా వైపు విచిత్రంగా చూసింది. పరిచయం కూడాలేని నేను అలా అసందర్భంగా పిలవడం ఆ అమ్మాయికి కోపం తెప్పించిందేమో!

నిమిషాల్లో ప్రొఫెసర్ గారమ్మా

# నూతన సంవత్సర పాప్యులారిటి పోటీ

## ఈ పత్రిక పాఠకులందరికీ వేలరూపాయల విలువచేసే బహుమతులు గెలుపొందండి. ఎంట్రీఫీజు లేదు.

మొదటి బహుమతి. ఒక స్కూటర్ వెస్పా లేక ఆల్విన్ రిఫ్రిజిరేటర్. ద్వితీయ బహుమతి : ఒక టేప్ రికార్డర్ లేక ఆటోమేటిక్ కెమేరా లేక రేడియోగ్రామ్ మూడవ బహుమతి : (540) జపాన్ మోడల్ యాషికా సూపర్ డీలక్స్ త్రీ బ్యాండ్ రూ. 275-00 ల విలువ గల ఆల్వరల్డు ట్రాన్సిస్టర్లు. నాల్గవ బహుమతి : (10) జపాన్ మోడల్ యాషికా జూనియర్ రూ. 275-00 ల విలువగల త్రీ బ్యాండ్ ఆల్వరల్డ్ ట్రాన్సిస్టర్లు.

## మీరు చేయవలసినది ?

7 (ఏడు) నుంచి 22 (ఇరవై రెండు) అంకెలవరకు ఒకేపర్యాయం వాడుతూ ఖాళీగళ్ళు అడ్డముగా, నిలువుగా, అయిమూలలుగా కూడిన 58 (యాభైఎనిమిది) వచ్చునట్లు పూర్తిచేయవలెను.

ప్రవేశరుసుము లేదు. ఇది ఒక పాప్యులారిటీ పోటీమాత్రమే.

ఆఖరి పోస్టింగ్ తేది : 8-3-73 ఫలితముల తేది : 10-3-73

సహాయము కొరకు 54 మొత్తముగల నమూనా.

| 20 | 7 | 8 | 19 |
|---|---|---|---|
| 10 | 17 | 14 | 13 |
| 15 | 12 | 11 | 16 |
| 9 | 18 | 21 | 6 |

పోటీ నిబంధనలు : 1) సాధారణ కాగితం వాడవలెను. 2) దిద్దులు, సవరణలుగల ఎంట్రీలు అంగీకరింపబడవు. 3) ప్రమోటర్లతీర్మానమే ఖాయమైనది. 4) నగదు రూపములో ఏ బహుమతీ ఇవ్వబడదు 5) మొదటిబహుమతి : 1) అఫిషియల్ సీల్డ్ సొల్యూషన్‌తో సరిపోయిన దానికి యివ్వబడును. 6) రెండవ బహుమతి 1) అఫిషియల్ సొల్యూషన్‌తో సరిపోయేటున్న పై మూడు అడ్డవరుసలకు. 7) మూడవ బహుమతి. 540) ఏ వరుసలోనైనా. ఏ సంఖ్యలోనైనా అఫిషియల్ సొల్యూషన్‌తో సమానముగా వున్నవారికి. 8) నాల్గవ బహుమతి : 10) అదృష్టవంతులైన ఎంట్రాంట్స్‌కు. 9) గెలుపొందిన వారు సదరు బహుమతులు పొందుటకు పోస్టేజి, ప్యాకింగ్, లైసెన్స్ ఫీజులు చెల్లించవలయును. 10) మూడవ బహుమతి గెలుపొందినవారుకూడా పై తెలిపిన ఖర్చులతో సహా ట్రాన్సిస్టరు ఖరీదులో సగం చెల్లించటమేకాక మా షరతులకు లోబడివుండాలి 11) ఫలితములు తెలిపిన తరువాత లైసెన్స్‌ఫీజు మొదలైనవి డిపాజిట్ చేయవలయునని విజేతలకు ఉత్తరం వ్రాయబడును. 12) ఫలితములకొరకు 25 పైసల స్టాంపులు పంపండి. 13) ఒక కుటుంబమునుంచి ఒక ఎంట్రీ మాత్రమే పంపాలి. 14) మీ విలాసమును ఇంగ్లీషు, హిందీలోనే వ్రాయవలెను. 15) కటింగు లేక నిబంధనల పత్రమును భవిష్యత్తులో ఉపయోగార్థం మీవద్ద ఉంచుకోండి.

**ASAHI JAPAN CORPORATION**
**KATRA KHUSHALRAI, NEW DELHI**

యికి జరిగిందంతా చెప్పాను. తాయారుని ఆకార్లోనే కింగ్‌జార్జి హస్పిటల్‌కి తీసు కెళ్ళడానికి ఆ అమ్మాయి సాయపడింది తాయారు ఎక్సర్‌సైజ్ సంగతి నేను ఆ అమ్మాయికి చెప్పలేదు. పెట్టె చేతిమీదపడి చెయ్యివిరిగిందన్నాను.

కారులో అంతబాధలోనూ కూడా తాయారు ప్రొఫెసర్ గారమ్మాయి నాజూకయిన శరీరలావణ్యంవైపు కళ్ళు విప్పార్చి చూస్తోంది. నేను కోపంగా చూసేసరికి కళ్ళు వాల్చుకుంది.

ప్రొఫెసర్ గారమ్మాయి ఎంత అందగత్తో, అంత మంచిది. కారులో నాతో కాస్తేపు బాతాఖానీ వెయ్యలేదు. నేను థ్యాంక్స్ చెప్పి మొహం పక్కకి తిప్పుకుని ఎటో చూస్తూ, 'నో మెన్షన్ ప్లీజ్!' అంది.

తాయారుని డాక్టరుగారు పరీక్షించారు. చెయ్యిఫ్రాక్చర్ అయిందిట! కనీసం మూడు నెలలయినా హాస్పిటల్‌లో వుంచాలిట! నేను ఒకణ్ణీ నీరసంగా యింటికి వచ్చాను

* * *

మరో మూడ్రోజుల తర్వాత-తాయారుని హాస్పిటల్లో చేర్చిన మూడో రోజు మంచి శుభ వార్త తెలిసింది. మేం రిపోర్ట్ యిచ్చిన పోలీస్ స్టేషన్‌లో ఆ దొంగ పట్టుబడ్డాడు తాయారు నగల్లో మంగళ సూత్రం మాత్రం దొరికిందిట!

హాస్పిటల్‌కి కేరియర్ తీసుకెళ్ళినప్పుడు, అది తాయారుకి చూపించాను. భక్తిగా కళ్ళకద్దుకుని మెడలో వేసుకోబోయింది. అటు ఇటూ ఎవ్వరూ లేకుండా చూసి నేను చప్పున దాని చెయ్యి పట్టుకుని ఆపి, మంగళసూత్రం నేనే మెడలో వేశాను. తాయారు మంచం మీది నుంచి నా వైపు వత్తిగిల్లుతూ అమాయకంగా నవ్వింది.

"మనకి మళ్ళా పెళ్ళయింది!"

"అవును! మనిద్దరం వధూవరులం! ఆ దొంగ పురోహితుడు. సరేనా? మరి శోభనం రాత్రెప్పుడు?" తాయారు పెదవుల మీదకి వంగబోయాను. చప్పున తడబడి సరిగ్గా కూర్చున్నాను డాక్టరుగారు లోపలికి వచ్చారు.

తాయారు మెడచుట్టూ చేతికి కలిపి పెద్ద కట్టువుంది. నేనే అన్నం కలిపి తినిపించాను.

* * *

మరో మూడునెలల్లో తాయారు హాస్పిటల్ నుంచి డిశ్చార్జి అయి ఇంటికి వచ్చింది హాస్పిటల్ నుంచి మొహమాటం కొద్దీ తక్కువ అన్నం తినడం వల్లనే, ఏమో తాయారు బాగా చిక్కిపోయింది.

"నీ ఎక్సర్‌సైజ్‌కి థ్యాంక్స్ చెప్పాలి! నువీ మధ్య బాగా కన్పిస్తున్నావ్" ఇంటికి రాగానే ఆత్రంగా తాయారుని దగ్గరకి లాక్కున్నాను. తాయారు కట్టు తీసిన సంగతి మర్చిపోయిందేమో, చెయ్యి

మడిచే వుంచడం అలవాటయింది ఆమెకి. నేను ఆ చెయ్యితీసి నా భుజంమీద అదిమాను. తాయారు గారాబంగా.

"మూడు నెలలనుంచీ ఎక్సర్‌సైజు చెయ్యడంలేదు. రేపట్నుంచీ..."

"వీల్లేదు."

"అదికాదండీ!...."

"ఏదికాదు! మళ్ళా నీ హాస్పిటల్ ఖర్చు నేను భరించలేను."

"అయ్యో రాత! అస్తమానూ పడతానా ఏమిటండీ?"

"వీల్లేదన్నానుగా!"

"అయితే నాతో మాట్లాడకండి! తాయారు అలిగింది. ఆ రోజంతా నాతో మాట్లాడలేదు. మూడు నెలలనుంచీ తాయారు ఎడబాటే దుర్భరంగా వుంది నాకు. ఇక అది కళ్ళముందు కదులుతూ, మాట్లాడకపోతే ఎలావుంటుంది? తాయారుని ఆసనాలు తప్ప మిగిలిన ఎక్సర్‌సైజ్‌లు ఏవైనా చేసుకోమన్నాను. మర్నాడు స్కిప్పింగ్ చేస్తానంటూ గదిలోకి వెళ్ళింది. వెంటనే నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుని తిరిగివస్తూ గబగబ పెరట్లోకి పరిగెత్తింది బాత్‌రూం వైపు.

నేను మళ్ళా ఏమైందోనని భయపడుతూ బాత్‌రూంలోకి వచ్చేసరికి తాయారు పైప్ దగ్గర మొహం కడుక్కుంటోంది.



"తాయారూ!" పిల్చాను సిగ్గుపడింది నేను దగ్గరకి వెళ్ళి మొహం పైకెత్తాను.

"ఇంక మరో ఏడాదివరకూ ఎక్సర్‌సైజ్ చెయ్యడానికి వీల్లేదుకదూ!" తాయారు సిగ్గుపడిపోతూ, తలూపింది.

"థాంక్ గాడ్!" నేను దాన్ని దగ్గరకు లాక్కుని చెవిలో.

"పోనీలే నీ వెయిట్ సగం మనబాబుకిచ్చెయ్యి!" అన్నాను తాయారు ఆ సిగ్గులోనే.

"నాకు పాపే కావాలి!" అంది. అదిరి పడ్డాను.

"ఎందుకూ? నా లాంటి వాడి కొంప ముంచడానికా? వద్దు వద్దు. నాకు బాబే కావాలి!"

తాయారు సమాధానం చెప్పలేనట్టుగా నాలో పరవశంగా వదిగిపోయింది. బహుశా ఆ పరవశం, పుట్టబోయే పాప చెయ్యబోయే ఎక్సర్ సైజ్, డైటింగ్ గురించే లేక బాబయితే, వాడా విస్కీలూ తియ్యడం గురించి కలలు కనడం వల్లనో! నాకు తెలియలేదు.

# కబుర్లు



## చలసాని ప్రసాదరావు

పాపం! అమాయకులు! వాళ్లలో వాళ్లే తన్నుకు చస్తున్నారు!" "అని మనమీద జాలిపడి దయ దలచినట్లున్నారు కేంద్ర సాహిత్య అకాడమీలోని ప్రభు వరేణ్యులు." ఆలస్యం అయితే, తెలివి మీరిపోయి వాళ్లంతా కలిసి ఏకంగా మనల్నే తంతారేమో అని కూడా సదరు సాహిత్య ప్రభువులు దూరాలోచనచేసి ఉండవచ్చును. ఏమయితేనేం గాని, చాలా సంవత్సరాలుగా తెలుగు వాళ్లకు సాహిత్యం అంటూ ఉందనే సంగతే మరచిపోయిన ఢిల్లీ సాహిత్య పాదుషాలు ఈసారి తెలుగువాళ్లకు చమ్కీటోపీని ప్రసాదించేరు.

ఏనాడో ఈ అకాడమీలు పుట్టక ముందు శ్రీ శ్రీ వ్రాసిన కవితల్నివాడు తీరికగా చదివించుకు విని "ఫర్వాలేదు, బాగానే ఉన్నట్లున్నాయే! కుర్రవాడు పైకి రాగల వాళ్లాగే ఉన్నాడు ఇప్పుడే కాస్త మంచి చేసుకుందాం!" అను కున్నట్లు న్నారు.

"నాయనా! విప్లవం-విప్లవం అంటు న్నావు. ఇబ్బందుల్లో ఉన్నట్లున్నావు. ఇందు! ఓ వంద ఫుల్ బాటిల్సూ, ఓ ఓ వంద ఫుల్ చికెన్సూ ప్రసాదిస్తున్నాం. అందుకో!" అన్నట్లుగా ఆనవాయితీగా పెట్టే సాహిత్య వార్షికాల పదులోంచి ఓ అయిదువేల రూపాయల వాయనం ప్రక టించేరు.

ఈ వాయినాల్నీ, వార్షికాల్నీ సదరు శ్రీ శ్రీ ఏనాడో హేళన చేసిఉన్నాడు. అకాడమీల్ని "అగాధమీలు, అనాధమీలు" అంటూ ముద్దు ముద్దుగా వాటిని ప్రశం సించే ఉన్నాడు. అంధ పరదేశ సాహిత్యా గాధమీలో తన కోసం వేసిన చందన ప్పీటను లోగడనే విరసం వాళ్ళకు భోగి మంటల్లో వేసుకుని వేడెక్కమని ఉదా రంగా దానంచేసి పారేశాడు కూడా.

ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీలుగా వర్థిల్లే సదరు అగాధమీల కన్నింటికి హెడ్డాఫీసయిన ఢిల్లీలోని కేంద్రసాహిత్య అకాడమీ వాళ్ళు ఇప్పుడీ శ్రీశ్రీ దగ్గర కొచ్చి "ఫర్వాలేదు, తమరూ ఓ కవి లాగే కన్పిస్తున్నారు. ఇదుగో మేం కూడా ఓ సర్టిఫికేట్ ఇస్తున్నాం." అన్నట్టు పోజుపెట్టి అయిదువేలు పుచ్చు

కువి తరించమంటున్నారు. పనిలో పనిగా విప్లవాత్మకతను కూడా గుర్తించ మంటు న్నారు.

''రెండు పెగ్గులు బిగించి. రెండు శ్రీలు ధరించి వెలుగు కవితా విపంచి'' అని శ్రీశ్రీని వర్ణించాడో పెద్దమనిషి. ఆ శ్రీలూ. పెగ్గలూ తరిగినా-పెరిగినా అతను మాత్రం కవి హృదయాల్లో వెలుగుతూనే ఉన్నాడు. నేటికి సరిగా మూడేళ్ళనాడు అత నికి అభిమానులంతా కలిసి ఘనమైన సన్మా నంచేసేరు. ఆనాడు దొరికిన శ్రీశ్రీ సమస్త రచనల్నీ పోగేసి ఆరు సంపు టాలుగా అచ్చేసి అతనికే సమర్పించేరు. మరేకవికీ జరగని గౌరవమది.

ఇది జరిగిన మూడేళ్ళకు మన అకా డమీ దుక్కాలువాల శాస్త్రర్లు నిద్రలేచి మేమూ ఉన్నాం అంటూ బయల్దేరేరు.

శ్రీశ్రీకి ఈ గౌరవాలూ. వేలూ క్రొత్తవేంగావు. కేవలం కవిత్వంతో సినీ వ్యాపారుల మీద మెరుపుదాడిచేసి శ్రీని లాక్కొచ్చి కాళ్ళ వద్ద పడేసుకొన్నాడొక నాడు. అంత త్వరగానే ఆవిడ పరారై పోతే నిర్లిప్తంగా నవ్వుకోగలిగాడు కూడా

పెగ్గుమీద పెగ్గువేసి ఎవరికీ అక్కర్లేని కవితల్లి కాలక్షేపం చేసిన రోజులూ ఉన్నాయి. అందుకు అపాలజీలు చెప్పు కున్న క్షణాలూ ఉన్నాయి.

''తప్పులయితే అందరూ చేస్తారు: త్యాగాలు కొందరే చేయగలరు'' గానీ శ్రీశ్రీ తప్పులు సునాయాసంగా చేసేయ గలడు. ఎత్తి చూపితే ''అయ్యో! నే చేసింది తప్పన్న మాట! సరే! అయిం దేదో అయిందిలే!'' అనేసి లెంపలు వేసు కోగలడు అమాయకంగా! ఉంటే. ఉన్న దాన్ని కళ్ళు మూసుకోకుండానే త్యాగమూ చేసేయగలడు. అందుకే శ్రీశ్రీ అంటే అందరికీ ఇష్టం.

అది అతి లౌక్యం అని గిట్టని వాళ్ళ ఉవాచ. కాదు. చిన్నపిల్లల అమాయకత్వం లాంటి నిష్కల్మషత అని అభిమానులు సమర్థన ఏమయినా తిడుతూ కూడా తన నిష్టపడే వాళ్లుండ గలగటం అనేది శ్రీశ్రీ ప్రత్యేకతే.

''సమకాలిక సంఘటనలకు అర్పించే స్వాగతం పకోడీల పొట్లాలకు పనికొచ్చే కాగితం'' అని వ్రాసిన శ్రీశ్రీయే అలాంటి కవిత్వాన్నే వెనకేసుకు రాగలడు. ''ప్రపం చాన్ని చూడలేని కవిత నిజం చూపదు. ఇసుకలోన తల దూర్చిన ఉష్ట్రపక్షి బాపతు'' అని సమర్థించగలడు.

''సీ కొక పిగరెట్టిస్తా నా కొక కథ కమ్మ రాసి నయముగ నిమ్మా!' అని అడిగాడా పెద్దమనిషి. సరే, రాసేసా నైండి!'' అని తప్పుకోనూ గలడు.

''నా కేమో లోకంలో కాకవులే కాన రారు. కవి దూషణ నన్నాకర్షించదు''




అంటూనే "అవురా మన తెలుగింట్లో కవిరాజులు, కవి వరాహ గార్దభ శున కాద్యవతార మూర్తు లెందారో! అ ఆ ఇ ఈ లైన రాని యంత్రబ్రహ్మలు" అనేయ గలడు

విన్నటిదాకా మిత్రుడుగా ఉండిన కవి పేటు ఫిరాయించగానే పత్రికా ముఖం గానే ఏకి పారేయ గలడు. 'అవేం తిట్లు సార్!' అంటే "ఛత్! నేను వాడిని తిట్టనేలేదు. చివాట్లు పెట్టాను! అంతే!" అని మనల్నే మందలించగలడు.

"నా పద్యాల్లో విప్పులు ఇంకా ఎక్కువగా కక్క మంటారా గురూ!" అనడిగిన యువకవికి "అబ్బే! విప్పులో పద్యాలు కక్కు" అని ఉపదేశించిన శ్రీ శ్రీయే విప్లవ కవుల్ని సమర్ధించేందుకు విప్పులు కక్కటమే మా పని! ఎలా కక్కాలనేది మా కనవసరం! అని విమర్శకుల్ని దగాయించ గలడు.

శ్రీశ్రీ సర్టిఫికేట్లివ్వటం లోనూ. వాటిని సునాయాసంగా ఉపసంహరించు కోవటంలోనూ కూడా సిద్ధహస్తుడే!

'నీవు రాసేది చాలు! ఇక నేమ పద్యాలు రాయక పోయినా ఫర్వాలేదు."

అని ఓ కవిగారికో సర్టిఫికేట్ పారేసి. ఆ తర్వాత "అబ్బే! అతను నా ఆశల్ని ఫలింపజేయలేదు. దారి తప్పిపోయాడు.

వియత్నాం యుద్ధంలో అమెరికావాడిలా సమగ్రాంధ్ర సాహిత్యంలో కూరుకు పోయాడు'' అనేయగలడు.

''అభ్యుదయ కవిత్వం విలువదనేది ఎవడో రెండు పింకీమిలు ఇన్నవాడు అన వలసిన మాట'' అని ఉద్ఘాటించిన శ్రీశ్రీయే 'అభ్యుదయ కవిత్వ కాలం చెల్లింది. ఈనాడు కావలసింది విప్లవ కవిత'' అని సింహనాదం చేయనూ గలడు.

''మార్క్సిస్టు ముదిరితే అనార్కిస్టు'' అని ప్రవచించికూడా అందరివనీ అయి పోయింది. మేమే మిగిలిన, ముదిరిన మార్క్సిస్టులం అన్నట్లుగా బల్లగుద్ది మాట్లాడనూగలడు.

''మానవుడుగా నేను ఎవరికన్నా ఎక్కువకాను, కవిగా అందరికన్నా అధి కుణ్ణి'' అనే ఆత్మవిశ్వాసం ప్రదర్శిస్తూనే తనను విమర్శించిన పత్రికకు లేఖరాస్తూ ''మీ విమర్శను కృతజ్ఞతతో స్వీకరించి ముట్టదాఖలు చేస్తున్నాను' అని వాతలు వేయగలడు.

''తొలినుండీ విశ్వనాథవారిని గొప్ప కవిగా గుర్తించినవారి జాబితాలో నన్ను నేను సగర్వంగా కలుపుకుంటున్నాను'' అని తనకో సర్టిఫికేట్ ఇచ్చుకుంటూనే ''అంతమాత్రాన ఆయన చేసిన, చేస్తున్న చేయనున్న అవకతవకలన్నింటికీ హారతి పట్టనక్కర్లేదు'' అంటూ సదరు కవి సామ్రాట్టుకూడా ఓ సర్టిఫికేట్ పారే యగలడు

ఓ ప్రఖ్యాతుని గ్రంధాన్ని సమీక్షిస్తూ ''చవకగా గ్రంథాలందించే ఈ ప్రచురణ కర్తలు ఆ చవకదనాన్ని వెలకు బదులు గ్రంథాల్లోని విషయానికే వర్తింపజేస్తు న్నట్లున్నారు'' అని మర్యాదస్తుల్లా పేజీ పెట్టనూగలడు.

''విదూషకుడి Temperament'' తన దని శ్రీశ్రీయే రాసుకున్నాడు. కనుకనే కాబోలు ఆయనగారి రాతలు రామలింగడి వాతల పద్ధతిలో ఉండి మింగనూలేని కక్కనూలేని స్థితిలోకి పడేస్తున్నాయి అయాపుల్నికూడా.

కనుకనే శ్రీశ్రీ అకాడమీవారి తద్ది నపు భోజనాలకు భోక్తగా వెళ్ళినా, వెళ్ళ కున్నా అందుకేదో ఒక జోక్ పుట్టించి కాలక్షేపం చేసేయగలడు. అది వేరేమాట.

కాపీ. ఇన్నేళ్ళ తర్వాతనన్నా అంద రికీ తెలుగులోకూడా కవిత్వం అంటూ ఒకటుందని అయిష్టంగానయినా ఒప్పు కున్న ఢిల్లీ సాహిత్య పాదుషాలకు జోహార్లర్పించవలసిందే.

కనీసం ఈ ఒక్కదానికిన్నా ''ఆంధ్రు లూ — తెలంగాణులూ'' సమైక్యంగా సంతోషించవచ్చు.

# శ్రీశ్రీకి అవార్డు

శ్రీశ్రీకి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి యిచ్చిందట ఇచ్చి తన అంతస్థు పెంచుకుందట. లెనిన్ కోరిన శ్రామిక రాజ్యం రాకుండా, లెనిన్ భావం ప్రబలంకాకుండా తన విష సంస్కృతీ శరాలతోనేకాక, తుపాకులతోకూడా ఎదురొడ్డానికి వెనుదీయని వర్గమే లెనిన్ శతజయంతిని జాతరగా జరిపినట్లు శ్రీశ్రీ భావాలను వ్యతిరేకించే అకాడమీ ఆయనకో బహుమతినిచ్చి సన్మానిస్తుంది.

కాని, లోకంలోని పండితులూ, భ్రష్టులూ, దీనులూ, హీనులూ, అభాగ్యులూ అశాంతుల ఆవేదనలను తనలో యిముడ్చుకుని, లోకపుటన్యాయాలనూ, కాల్చే ఆకలి, కూల్చే వేదనలనూ బహిష్కరించే పాటలు వ్రాస్తూ, శ్రామికలోకపు కల్యాణానికి తన కవనాన్ని అంకితం చేసి భువన ఘోషకు తన వెర్రిగొంతుక విప్పి వినిపించే తపస్విగా పోనీ పోతే పోనీ సతుల్ సుతుల్ హితుల్ పోనీ, తిట్లూ రాట్లూ పాట్లూ వస్తేరానీ అంటూ తెగించి నిలబడిన శ్రీశ్రీకి ఇలాంటి బహుమతులు వస్తే రాని పోతే పోనీ

శ్రీశ్రీ బతికిన బతుకు బహుమతులకు భ్రమసిపోయే బతుక్కాదు. అది అకాడమీ అవార్డుకు అతీతమైన బతుకు. ఆయన స్వప్నాన్ని ప్రజలు నిజం చేయగలిగితే, ఆయన కలగన్న స్వర్గాన్ని రుజువు చేయగలిగితే అదే ఆయనకి అవార్డు

శ్రీశ్రీకి కావలసింది కోటుకు తగిలించుకునే అందమైన గులాబీ కాదు. ఆయనక్కావలసింది ప్రజల త్యాగాలతో తడిసి ఎరుపెక్కిన మందారం.

తాను కష్టజీవులకు నిత్యమంగళం నిర్దేశిస్తూ పాడిన పాట జాతి జనులుపాడుకునే మంత్రంగా ప్రయోగించాలనుకున్నాడు. తానొక విప్లవగీతానన్నాడు. భావివేదముల జీవనాదములు జగత్తుకంతా చవులిస్తానని ఆయన చేసిన ప్రతిజ్ఞ మరచిపోదని ఆశిదాము.

—కృష్ణవేణి




(గత సంచిక తరువాయి)

"ఏమిటి చాలా ఆలోచిస్తున్నారు?"

ప్రశ్నించారు రావు. 'ఏంలేదు. మనం వెళ్ళకపోతే... ఆలస్యం అవుతుందని' ఏం చెప్పాలో తెలియలేదు వసంతకి. ఎందుకంత సూటిగా చూస్తాడు? ఎందుకా కళ్ల అంత తీవ్రంగా వుంటాయి? ఎందుకంత తీవి?

"మీకు కాల్లో ముల్లు గుచ్చుకుంది. అది మరచిపోయారా?" నవ్వేడు రావు. తనూ నవ్వుతూ-'వంక కోసం వెతడం లేదు నేను' అంది.

పడిపోయిన పువ్వులు ఏరడం మొదలు పెట్టింది.

"మీరుండండి. నేను అందిస్తాను." అంటూ రావుగారు పున్నాగ పూలన్నీ ఏరి ఆమె ఒడిలో పోశారు. బంతి పువ్వులన్నీ ఏరి చేతుల్లో పెటారు.

ఒక్కమాట లేకుండా యిలా పని చేస్తున్నరావు చేష్టలనేచూస్తూ నిలబడింది వసంత.

సీరియల్

అలా చూస్తూనే ఏమేమిటో ఆలో చిస్తూంది.

పువ్వులన్నీ ఏరియింకా అలాగే నిలబడ్డ వసంతకేసి చూస్తూ నిలబడ్డారు రావు. ఆయన ముఖంలో మార్దవత్వం ఏర్పడింది. శిల్పి చెక్కిన బొమ్మలా చేతులనిండా పువ్వులతో నిలబడిన వసంత ఆయన కళ్లకి అప్సరసలా కన్పించింది. పొడుగాటి జడ. చిందర వందరగా నుదుటిమీద పడి ఆడుకుంటున్న జుట్టు. పైపెదవిమీద చిన్న పుట్టుమచ్చ. ఎందుకిలా నా యింటి కొచ్చిం దీమె? యింత ఆలస్యంగా? యింతకాలం వృధా అయిపోయాక?! అనుకున్నారు 'నా మనస్సుకే గుచ్చుకుంది—వసంత పాదం లోని ముల్లు' అనుకున్నారు

''ఎక్కడ చూస్తున్నారు ఇంద్ర ధనస్సుని? మనస్సులోనా? ఆకాశంలోనా?'' నవ్వుతూ అడిగారు.

పులిక్కిపడింది వసంత. ఆ పులికి పాటుకి పక్కకి పడబోయింది. చేయి అడ్డుపెట్టి ఆపారు రావుగారు.

"రండి వెడదాం. ఎవరూ మీరేమై పోయారో అని బాధపడకపోయినా సరస్వ తమ్మగారి మనస్సుకి విశ్రాంతి వుండదు" గట్టిగా నవ్వేశారు రావుగారు. 'వెళ్లేముందు ఒక్కటి.'' అంటూ వసంత చేతిలోంచి ఓ బంతిపువ్వు అందుకున్నారు. ఒకచేత్తో దాన్ని పట్టుకుని రెండో చేతి మునివేళ్లతో సుకుమారంగా వుండే దాని రేకులు రాస్తూ 'యీ బంతిపువ్వు బటన్ హోల్లో పెట్టుకోలేను. పోనీయండి. చెవిలో పెట్టు కుంటాను' అంటూ చెవిసందున అమర్చు కున్నారు. ఆ చిన్నిచేష్టకి తత్తర పడి పోయింది వసంత. 'ఈ ఆకర్షణ ప్రమా దమే కాదు. ప్రాణాపాయం.' అనుకుంది.

''మీరు ఎక్కువ కాలం యిక్కడే వుండక పట్నంలో వుంటారెందుకు? అక్కడ మీకేంపని?'' అని అడగాలను కున్న వసంత మాటలు పెదవి దాటకుండానే 'అదుగో టీచర్. అదిగో డాడీ' అంటూ ముందుకి పరుగెత్తి వచ్చారు పిల్లలు. వారి వెనకే వస్తున్న సుబ్బారావు - రావుగారి పక్కనే హుందాగా నడిచి వస్తున్న వసం తనిచూసి నిశ్చేష్టుడయ్యాడు.

"డాడీ." అంటూ శాంతి వెళ్ళి వాళ్ళ నాన్న మీద పడింది. ఆయన దాన్నలాగే పొదవి పట్టుకుని 'మీ టీచర్ వచ్చేదాకా ఆగక ఎందుకు వెళ్ళిపోయారు? ' అంటూ అడిగారు.

"అదే....చాలా దూరంలో వుండి పోయారేమోనని మేము బయలుదేరాం' సమాధానంగా నసిగాడు సుబ్బారావు. అలాగా? అన్నట్టు ఒక్క చూపు చూసి ముందుకు సాగారు రావుగారు.

అంతా ఆయన వెనకే గబగబ నడి చారు.

సుబ్బారావుకి మటుకు వసంత చేతిలో వున్న బంతిపువ్వు రావుగారి చెవిలోకెలా వెళ్ళిందో అర్థం కాలేదు.

'డాడీ కొండ దొర!' అంటూ చప్పట్లు కొట్టి నవ్వింది శాంతి.

అప్రయత్నంగా రావుగారి చెయ్యి చెవి మీది పువ్వు దగ్గరకి వెళ్ళింది. తీసేయబోయి, మనసు మార్చుకుని సరిగ్గా సర్ది పెట్టుకున్నారు.

ఎందుకో తెలియకుండానే వసంత హృదయం వేగంగా కొట్టుకుంది. పువ్వు తీసి పారేస్తే! ఎందుకో ఆ క్షణంలో ఆ పువ్వొక చిహ్నంగా అయిపోయింది.

అంతా కలిసిరావడం చూశారు సరస్వతమ్మగారు. 'అడిగో అబ్బాయి వచ్చేశాడూ' అంటూ సర్దుకు్కూర్చున్నారు.

అంతా కూర్చున్నాక నూకాలు బాస్కెట్ విప్పింది. మెల్లిగా అన్నీ అందిస్తుంటే వసంత అందరికీ అన్నీ వడించింది.

'మీరూ ఒక ప్లేటు తీసుకోండి' అన్నాడు రావు వసంత వూరుకోవడంతో.

'మీరంతా అయ్యాక నేను' అంది వసంత.

''అదేమిటమ్మాయి-యిక్కడ కూడా యజమానీ ఉద్యోగీ అంటూనా! తీసుకో.' అని హెచ్చరించారు సరస్వతమ్మగారు.

'చూడండి వసంతగారూ, నేను యజమానిననీ మీరు నా దగ్గిర ఉద్యోగి అనీ కాదు. మీరు చాలా ప్రత్యేకమైన వారు. మా సరస్వతమ్మ గారెప్పుడూ అలా మాటలు తప్పుగా విరుస్తూ వుంటారు' నవ్వుతూ అన్నారు రావుగారు.

వసంత కృతజ్ఞత నిండిన కళ్ళతో ఓసారి రావుగారికేసి చూసి కళ్లు దించుకుంది. ఆ చూపు సుబ్బారావు చూసి ఆ క్షణంలోనే తన ఓటమి ఒప్పేసుకున్నాడు మనస్సులోనే.

వసంత తను కూడా ఒక ప్లేట్లో వడ్డించుకుంది.

చాలా మౌనంగా అంతా తినడం ముగించారు. భోజనం కాగానే సుబ్బారావుగారు లేస్తూ, 'నేను కొంచెం కాగితాలు చూసుకుంటాను సార్, ఈ రోజు మీరు వెంకన్న తాతని చూస్తానన్నారుగా!' అడిగాడు.

''అవును సుబ్బారావూ సాయంత్రం వెడతాను. ఈ లోగా నువ్వా కాగితాలు సిద్ధం చేయించు'' అన్నారు.

పున్నాగ చెట్టుకి కొంచెం దూరంలో వున్న యింటివేపు వెళ్ళిపోయాడు సుబ్బారావు.

''నేనూ కాస్సేపు నడుం వాలుస్తాను.'' అంటూ అటు తిరిగి పడుకున్నారు సరస్వతమ్మగారు. మళ్ళీ బాస్కెట్ సర్దేసి చెట్టు వెనక వెళ్ళికూర్చుంది నూకాలు.

పిల్లలిద్దరూ వసంత కిటూ అటూ చేరారు.

పున్నాగ పువ్వులు తీసుకుని ...



చక్కగా గజ్జెల పట్టెడలా జడ అల్లడం నేర్పిస్తూంది వసంత. ఆమె వేళ్ళకేసి చూస్తూ కూర్చున్నారు రావుగారు....తల కింద మోచేయిని ఆన్చుకొని పడుకున్నారు.

సుందరీ శాంతా అడుగున్న వాటికి ఏదో ఒకటి చెపుతూ-జడ ఒకటి అల్లింది వసంత.

'ఇది నాకు' అని లాక్కుంది సుందరి.

దాన్నితీసి తండ్రి క్రాఫింగుకి చుటూ కి[illegible] [illegible] అయినా రావుగారేం అనలేదు.

పిల్లలంటే యింత ఆప్యాయం.ఓర్పు ఉన్న యీ పెద్దమనిషి ఎందుకు వీళ్ళకి దూరంగా వుంటున్నాడు? అనుకుంది వసంత.

"వసంతగారూ, మీ రెప్పుడేనా ప-టూళ్ళు చూశారా?'' కుతూహలంగా అడిగారు రావు.

''స్వామీజీ వున్న చోటు పట్నం

అయినా పల్లె అంత ప్రశాంతంగా వుంటుంది" అంది వసంత.

"అలా కాదు. అక్కడ పల్లెలో ఉన్న యిబ్బందులు వుండదుగా. మీకేం లైట్లు లేవా? కుళాయిలు లేవా?" నవ్వారు రావు గారు.

"అలాంటి యిబ్బందులని తోసిరాజన కల్గిన సుఖం శాంతి పల్లెల్లో వుంటుందని నా భావన" అంది వసంత.

"అదంతా పుస్తకాల్లో చదివి ఏర్పరచు కొన్న భావన. అసలు పరిస్థితులు చాలా దారుణంగా ఉంటాయి. ఇలా ఉంటాయిని కనీసం మీరు వూహించను కూడా వూహించలేరు. ఇక్కడ పూరి పాకలు అనారోగ్యకరమైన వాతావరణం మీలాంటి సుకుమారులు ఒక్క క్షణం కూడా సహించ లేరు" అన్నారు.

"దానికంతా కారణం ఎవరు? మీలాగా పల్లెల సంపదలని పట్నంలోనే ఖర్చు చేసే వారు కాదా? ఇక్కడ వుండి కష్ట సుఖాలు తెలుసుకోలేని భూకామందులు కాదా?" తీవ్రంగా అడిగింది వసంత.

ఆ తీవ్రతకి నవ్వుతూ లేచి కూర్చు న్నారు రావుగారు.

"అదీ ఉడుకు నెత్తురు అంటే. పోనీ నేనిక్కడ వుండి పొలాలు చూసుకున్నంత మాత్రాన పరిస్థితులు బాగుపడతాయి అనుకుంటున్నారా?

"కొంత తప్పక బాగుపడతాయి. యజ మాని ఎదుట ఉంటే-ఎప్పుడూ ధైర్యంగా వుంటుంది." అంది నెమ్మదిగా.

"అలాగా ..." అంటూ తిరిగి చేతి మీద తలానృకు పడుకున్నారు.

"మాడు డాడీ కిరీటం పడిపోయింది" అంటూ శాంతి మళ్ళీ సర్ది పెట్టింది.

"నా లాంటి వాళ్ళు ఒకరిద్దరుంటే పరి స్థితులు బాగుపడవు చాలా మందిఉండాలి. యిప్పుడిక్కడ భూషణంగారినే తీసుకోండి. ఆయన ఎంతేనా కష్టపడతాడు-నేనిక్క డుండి అన్నీ చూసుకోవడం ప్రారం భిస్తే ."

"అయితే ఒక వ్యక్తికోసం ...చాలా మంది బాధ పడ్డం చూస్తూ వూర కుంటారా?"

"మా అమ్మగారీ వూరు సంగతులు చాలా చెప్పినట్టున్నారు మీకు." నవ్వుతూ అన్నారు రావుగారు.

ఒత్తిగిలి పడుకున్నా ఓ చెవి యిటు పారేసిన సరస్వతమ్మగారికీ సంభాషణ అంత రుచించడంలేదు. ఒక దగ్గు దగ్గి యిటు తిరిగింది.

"అయ్యో. తలగడ లేకుండా పడు కున్నావేమిటి బాబూ. యిందు." అంటూ ఓ తలగడ అందించింది.

"ఫరవాలేదండీ. ఓసారి లోకాభి రామాయణం తిరగేశాం నాకూ పనివుంది మళ్ళీ ఓ గంటలో వస్తా" నంటూ తల




మీది పూలకిరీటం తీసి కూతురి తలకి తగి ల్చారు చెవిలో బంతిపువ్వు భద్రంగా జేబులో పెట్టుకుంటూ "నూకాలూ, ఈ పూలన్నీ బాస్కెట్‌లో పెట్టువాడి పోతు న్నాయి' అంటూ లేచి ఆఫీసు కేసి నడి చారు.

"ఎంత తెరిపిగా కూర్చున్నాడో! ఎప్పుడూ వురకలూ పరుగులూ కదా!" వింతపడ్డారు సరస్వతమ్మగారు,

"ఆదేటండీ అయ్యగా రెప్పుడొచ్చినా పని ముగించుకునేగా వెళ్ళడం." అంది నూకాలు. బంతిపూలన్నీ ఎత్తి బాస్కెట్‌లో పెట్టుతూ.

"ఆఁ మీ అయ్యగారి యిదేం చెప్ప క్కర్లేదు లేవే! మళ్ళీ తిరగడానికి పోతారా? పడుకుంటారా?" అన్నారు పిల్లలకేసి చూస్తూ.

శాంతి మూతి మూతు వంకలు తిప్పింది.

సుందరసలు తలెత్తలేదు!

"గడుగ్గాయిలు! మనిషికి బదులు చెప్పరు!" అంటూ విసుక్కున్నారు,

ఆమె అటు తిరిగి పడుకోవిచ్చి మాట్లాడకుండా పిల్లలు చేతులు పట్టుకుని తోటలోకి దారితీసింది వసంత, సరస్వ తమ్మ ముందామెకి ముళ్ళ మీదున్నట్టుంది. ముగ్గురూ ఒకరినొకరు తరుము కొంటూ పరుగెత్తారు.

ఆఫీసు గది కిటికీ ముందర పరధ్యా హ్నంగా నిలబడ్డ రావుకి బాణాల్లా దూసుకు పోతున్న ముగ్గురూ కన్పించారు. ఆయన మనస్సెందుకో వికలమైంది.

ఏదో పోగొట్టుకున్నట్టు అనిపించింది. నిట్టూరుస్తూ-వెళ్ళి బల్లదగ్గర కూలబడ్డారు.

వసంత అంత హాయిగా నవ్వి అంత స్వేచ్ఛగా పరుగెట్టి ఎంత కాలం అయిందో. కొత్తగా రెక్కలు వచ్చినంత ఆనందంగా వుందామెకి. తాను వచ్చినప్పుడీ సుందరీ శాంతీ ఎలా ముడుచుకుపోయి వుండేవారు? ఈనాడు కొత్తగా గొంతువిద్ద కోయిల్లా తోట దద్దరిల్లేట్టు అరుస్తున్నారు!

సాయంత్రం అయిపోయింది. సంధ్య కాంతులు ఆకాశాన్ని రక్తపు మడుగులాగా చేశాయి. చెట్లు చేమలు వింతగా నల్లలా మెరుస్తున్నాయి.

చూస్తూండగానే హఠాత్తుగా చీకట్లు అలముకుంటాయి.

'రండి పోదాం, బాగా ఆలస్యం అయితే కష్టం' అంటూ వాళ్ల చేతులు పట్టుకొని పున్నాగ చెట్టువైపు పరుగెత్తింది వసంత.

అప్పటికే నూకాలు అన్నీ సర్దేసింది. సరస్వతమ్మగారు చెట్టుని ఆనుకుని నిలబడి వున్నారు. -ఆమె ఎందుకో కోపంగా వున్నారు. నూకాలు జంకుతూ చూస్తోంది. వసంత కళ్ల పడగానే "అదిగో అమ్మాయిగారొచ్చేశారు!" అంది.

"ఆ రాక! అయినా యింత యిదా!" అంటూ సణుక్కున్నారు సరస్వతమ్మగారు

"నూకాలూ కారుదగ్గిరికి పోదామా?" వస్తూనే అడిగింది వసంత-ఆయాస పడుతూ.

"అంత ఆయాస పడకపోతే-నడచి రాకూడదమ్మా?' విసుక్కురంగా అన్నారు సరస్వతమ్మగారు.

"యింట్లో ఎలాగా పరుగెత్తలేరు. యిక్కడేగా పిల్లల్ని పరుగెట్టనివ్వండి" అంది నూకాలు.

'పిల్లల సంగతికాదు నేననేది-టీచరమ్మ సంగతి' అన్నారు.

'పిల్లల్తోపాటే టీచరమ్మగారునూ అవునా సుందరమ్మా?' అడిగింది నూకాలు.

అవునంది సుందరి, నూకాలు గట్టిగా నవ్వింది.

'మరింక వెళదామా?' అంది వసంత. ఆమె ముఖంలో సరదా పోయింది-సరస్వతమ్మగారి మాటలతో. 'వుండండమ్మాయిగారూ, బాబుగారొస్తా నన్నారు' అంది నూకాలు.

ఆ క్షణంలో ఆఫీసు తలుపులు మూసి మెట్లు దిగారు రావుగారు. వెనకాలే సుబ్బారావు వస్తున్నాడు. వసంతని చూసి తన చెవికేసి చూపిస్తారు చెయ్యి అక్కడ పువ్వులేదని తెలిసీ. ఆ నిముషంలో ఆచేష్ట వసంత హృదయంలో సంచలనాన్ని రేకెత్తించింది. 'మరుక్షణంలో మరిచిపోతారు అనుకుంది. 'నేనూ అంత తొందరగా వీరిని మరిచిపోయేలా చెయ్యి భగవంతుడా' అనుకుంది మనస్సులోనే.

దగ్గరికి వస్తూనే రావుగారు "నేను ఊళ్లోకి వెడుతున్నాను, నాతో వస్తారా?" అని అడిగారు వసంతని. "మేం వస్తాం డాడీ' అంటూ తంద్రిమట్టూ ఎగరడం ప్రారంభించారు సుందరీ శాంతి.

"మీరు యింటికి వెళ్లండి. సుబ్బారావ్. నువ్వు కారు తీసుకెళ్లు. నేను వసంతగారు అలా నడిచి వెంకన్న తాతని చూసి వస్తాం" అన్నారు తన నిర్ణయం ఒక్క ముక్కలో చెప్తూ.

వసంతను వదిలి అంతా కారుకేసి నడిచారు. "ఇటు వెనసుంచి చాలా దగ్గర రండి వెడదాం" అంటూ దారితీశారు రావుగారు.

సూర్యాస్తమయం అయిపోయింది. యింకా కొంచెం ఆకాశం అంచున ఎర్ర రంగు మిగిలింది. ఏవో పక్షులు తెగ గోలగా అరుస్తున్నాయి. కొంచెంసేపు ఏం మాట్లాడకుండా యిద్దరూ నడిచారు. ఒకటీ అరా యిళ్లు వస్తున్నాయి చేతిలో వున్న చిన్ని బెత్తంతో దూరంలో ఓ యిలు చూపుతూ "అదిగో అదే వెంకన్న తాత గుడిసె. ఓ ముసలాడు చచ్చిపోతున్నా ధంధులో. నేను కొంచెంసేపు ఆతనితో కూర్చుందామని వెళుతున్నాను. మా నాన్నగారి దగ్గరకి వచ్చేసరికి పెద్దవాడు నన్ను వుప్పుమూట మోసేవాడు. గుర్రం ఆడించేవాడు. యీ తోటలన్నీ తిప్పి ఆడించేవాడు... నన్ను వీపున పెట్టుకుని చెట్టుకి తాడువేసి చుక్కల పర్వతం ఎక్కుతోంది గుర్రం అనేవాడు....పాపం! యిక నిజమైన చుక్కలదారిని వెళ్లిపోతాడు" చాలా సాత్వికంగా-ఎంతో అభిమానంతో అంటున్నట్టున్న ఆ కంఠధ్వనికి చలించింది వసంత.

రావుగారికేసి తలెత్తిచూసింది.

ఆయన వసంతకేసే చూస్తున్నారు. ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి. ఆయన

---

ఒక మీటింగ్‌లో మాట్లాడటానికి ఒక వ్యక్తిని ఒప్పించారు

అతడు మీటింగ్ సమయానికి త్రాగేసివచ్చి మైక్‌ముందు నిల్చుని "ఇక్కడ కుడి ప్రక్కన కూర్చున్న వారంతా ఇడియట్స్. ఎడమ ప్రక్కన కూర్చున్న వారంతా రోగ్స్!" అన్నాడు.

దాంతో కుడిప్రక్కన కూర్చున్న ఒకడు కోపంగా లేచి "నేను ఇడియట్‌ని కాదు" అన్నాడు.

"అయితే కుడివైపు ఎందుకు కూర్చున్నావు? ఎడమ వైపు పో!" అని అరిచాడా త్రాగుబోతు వక్త.

—ఆకాశం గోవిందస్వామి, కారిపాకు.

చూపులో బాధ... సన్నని వెటకారం కనిపిస్తోంది. ఆయన ప్రతిమాట తనని కటివేస్తున్నాయి అనిపించింది వసంతకి. ఇన్నాళ్లు యీ కంఠధ్వని కోసం, యిటు వంటి చూపుకోసం ఎదురు చూశానా? అనుకుంది. తన పాదాన్ని పట్టుకొన్న ఆ చేతుల స్పర్శ ఎలా మరచి పోగలను అనుకుంది? కాని మరుక్షణం సరస్వతమ్మ గారి మాటలు జ్ఞాపకం వచ్చాయి తన గుండెల్లో దింపిన కత్తిని ఎవరో కసిగా తిప్పినట్లయింది. "నే చాలా దూరం వచ్చేశాను-యిలా అనుకో గల్గుతున్నా నంటే!" అనుకుంది ఆమె పెదవులమీద సన్నని నవ్వు వెల్గింది.

"దేనికో ఆ నవ్వు? అనుకుంటూ కళ్లు తిప్పుకున్నారు రావుగారు. ఎన్నాళ్ల కిలాంటి వ్యక్తి కన్పించిందీ? యిప్పుడు కన్పించి ఏంలాభం? అనుకున్నారు. "ఈ ఊళ్లో ప్రతియిల్లూ నాకు తెలుసు. ప్రతి పొలం నాకు తెలుసు. కాని నేనిక్కడ ఏం చెయ్యలేక పోతున్నాను" తనలో తనుగా అన్నారు రావుగారు "సంకల్పం వుండాలి ఉంటే ఎప్పటికేనా చెయ్య కల్గుతారు." అంది వసంత.

"ఇదిగో వచ్చేశాం చూశారా?" అంటున్న రావుగారి కళ్లకి అడ్డుగా పరు గెత్తాడొక చిన్న కుర్రాడు. "పెద్దలొస్తు న్నప్పుడలా అడ్డెళ్లద్దని ఎన్నిసార్లు చెప్పాలి?' అంటూ ఆ కుర్రవాడి రెక్కలు పట్టుకుని గుంజి పిల్చిపెట్టాడో యువకుడు "దండాలండి" అని రావుగారిని పలకరిస్తూ.

"తాతకెలా వుంది" అంటూ జేబులోకి చెయ్యిపోనిచ్చి ఓ అర్ధరూపాయికాసు 'యిందా' అంటూ కుర్రాడికేసి విసిరారు.

అదిదొర్లి మట్టిలో పడింది.

ఆ కుర్రాడు దానికేసైనా చూడలేదు. "మొండివాడు బాబూ....బాబుగారి స్తేఎంత పొగరురా." అంటూ నెత్తిమీద మొట్టాడు కుర్రాణ్ణి. కుర్రవాడొక్కసారి తలవిది లించి వసంతకేసి ఒక్కచూపు చూసి మెరుపులా పారిపోయాడు. ఆ చూపులోని పోలికలు వసంతని విభ్రాంతురాలిని చేశాయి?

"ఎవడీ కుర్రాడు?" గట్టిగానే ప్రశ్నిం చింది.

"వెంకన్న తాత పెంచుతున్నాడు." అంటూ వంగి గుడిసెలోకి ప్రవేశించారు రావుగారు వసంతకూడా లోపలికి వెళ్లింది గుడ్డిదీపం వెల్తురులో-ఆ గుడిసె భయంకరంగా కన్పించింది- వసంతకి. ఇక్కడెలా వూపిరి సల్పుతోంది? అను కుంది

ఇదేం పట్టించుకోకుండా మూల్గుతూ పడివున్న వెంకన్నతాత కుక్కి మంచం దగ్గిరకి నడిచారు రావుగారు.

కొంచెం ఒత్తి పెద్దదిగాచేసి దీపాన్ని తెచ్చి తాత మంచం పక్కగా పెట్టింది- మనవడి పెళ్లాం.

మృత్యుచ్ఛాయలు అలముకున్న తాత ముఖం చూసి నిట్టూర్చింది వసంత.

ప్రశ్నార్థకంగా వసంత ముఖంలోకి చూశారు రావుగారు.

(సశేషం)

# వస్తు విశేషములు

సుగుణ

## ఆవు పాలు

ఆవు పాలు వేడిచేయునని మనవాళ్ళు చాలా మంది వాడరు. అలాగే తమిళులు గేదెపాలంటె ఇష్టపడరు మాకు తెలిసిన ఒక డాక్టరు తరచు చెప్తూండే వారు. "ఆవుకు గేదెకు గల వ్యత్యాసం గమనించండి! ఆవు చురుగ్గాను, శుభ్రంగాను వుంటుంది గేదె మందమతిగా బురదలో పడుకుని వుండటం ఇష్టపడుతుంది. అలాగే గేదెపాలకంటే ఆవుపాలల్లో మనస్సుకు, శరీరానికి చురుకుదనాన్నిచ్చే గుణాలున్నాయి" అనేవారాయన.

ఆవు పాలు—సమశీతోష్ణమయినవి, రుచిగనుండును. తేలికగా జీర్ణమయి, దేహపుష్టిని వీర్యపుష్టిని. దీర్ఘాయువును కలుగజేయును. వాత, పైత్యములను పోగొట్టి బుద్ధి బలమునిచ్చును. కఫమును హరించును స్త్రీల పిండోత్పత్తి స్థానమునకు బలము జేయును. పాలు గలుగజేయును ఆవు పజ్జిగ—మేహశాంతి, పైత్యశాంతి కలుగజేయును. రుచిగనుండును. సర్వ కాలములయందును త్రిదోష హరమై, రోగులకును పథ్యకరమైనది

ఆవు నెయ్యి-రక్త పుష్టిని ఆయు వృద్ధిని కలుగజేయును. సర్వదోషములను, విషములను పోగొట్టును. ఆవునేతితో దీపారాధన చాల శ్రేష్ఠము. శుభ ప్రదమైనవి. దుష్ట క్రిమి సంహారక గుణమిందు గలదు. ఈ నేతితో తలంటుకుని శిరః స్నానము చేసిన శిరస్సుకు, నేత్రములకు మేహశాంతి చేయుటయేగాక మిక్కిలి ఆరోగ్యమును కలుగజేయును. ఆవు వెన్న—చలువజేయును. త్రిదోషములను హరించును. నేత్రరోగములను జయించును. అన్ని విధములైన దగ్గులను పోగొట్టును. మేహశాంతినిచ్చును. (ఆవు నేతిలో కొవ్వు పదార్థము చాల తక్కువ వున్నది) ఆవు పేడతో ఇల్లలికిగాని, వాకిళ్ళలో కళ్ళాపి చల్లిగాని, ముగ్గులు పెట్టిన చూచుటకు ముచ్చటగా నుండును. అంతేగాక మలినమును, దుర్గంధమును, విషవాయు దోషములను, హరించును. మిక్కిలి పరిశుభ్రముగా నుండును, లక్ష్మీకరమైనది ఆవుపేడ కాల్చిన మెత్తని బూడిదతో పళ్ళు తోముకొనిన పళ్ళకు కాంతిని, గట్టిదనమును ఇచ్చును.




ఆ వేళ మా వారెందుకో చాలా హుషారుగా వున్నారు.

ఒహుశా హైకోర్టు వాళ్ళు (your work is satisfactory) యువర్ వర్క్ ఈజ్ సాటిస్ ఫాక్టరీ అనుంటారు. లేకపోతే ఈ మధ్య మీ జుత్తు నల్లగా కని పిస్తోందని వాళ్ళ (additional



judge) ఎడిషినల్ జడ్జీ అనైనా పెయింట్ అయిపోయుంటాడు.
ఉంటాడు. అదీ ఇదీ కాకపోతే అదేఁవిటో ఆయన కదో సరదా.
ఎవడో దిక్కుమాలిన సాక్షిని ఏ వకీలునీ ప్రశ్నలు వెయ్యా
అల్లరి పెట్టేస్తే వాడు (faint) నివ్వరు, క్రాస్ ఎగ్జామిన్ (cross

examine) చెయ్యనివ్వరు. ఆర్గు మెంట్ (argument) చెప్పనివ్వరు.

రెండువైపులా ప్రశ్నలు తనే వెయ్య డం, ఆర్గుమెంట్ (argument) కూడా తనే చెప్పేసుకోవడం ఆయనికి సరదా. "ఆ వకీళ్లు బోలెడు డబ్బు పుచ్చుకుంటారు కదా. మీ కెందుకీ శ్రమ. హాయిగా వాళ్ళు చెప్పేదేదో విని రెండు ముక్కలు రావి పోక' అని నాలాంటి వాళ్ళెవరైనా అంటే యుద్ధం చెయ్యనని నేలని చతికిల బడిన అర్జునుడి వేపు శ్రీ కృష్ణుడు చూసిన చూపొకటి చూసి వెంటనే గీతా బోధకి ఉపక్రమిస్తారు. కృష్ణుడి గీతకి అంతం ఉంది కాని మా వారి గీతకి అంతం లేదు. ఆదేమంటే "ఆ కృష్ణుడికేం తెలుసు నా మొహం! పిల్లిగ్రర వాయించుకోడం ఆడపిల్లల్తో సరసాలాడ్డం తప్ప చేతనైతే ఒక్క సెషన్సు కేసు (sessions case) విచారించమను. చేతనైతే ఒక్క కేసులో ఒక్క సాక్షి చేత నిజం చెప్పించమను.. మొన్న మర్డర్ కేసులో వచ్చినవాడి కొడుకు అంతా తను చూసినట్టు చెప్పే స్తున్నాడు. వాడిస్తున్న ఖూనీ వివరాలు చూస్తుంటే పిడేచేశాడేమో ననిపించింది పాపం ఆ ముద్దాయి ప్లీడరు పాతకాలం మనిషి ముద్దాయి ఎప్పుడు కొట్టేడు? ఎక్కడ కొట్టేడు? అంటూ చచ్చు ప్రశ్నలు వేస్తూ వుంటే ఆ సాక్షి ముండా కొడుకు అతన్ని ఛెడీ ఫెడీ మని అబద్ధాలతో మాతి మీద కొట్టేస్తున్నాడు. ఇదిలాక్కాదని ఆ ప్లీడరుని ఆగమని నేను తలా తోకా ముడిపెట్టి రెండు ప్రశ్నలు వేసేసరికి ఆ సాక్షిగాడు ముందు మంచినీళ్లు అడిగేడు. మరో రెండు వేసేసరికి మంచినీళ్ళడగ లేదు. మూర్ఛపోయేడు...." అంటారు.

"అయ్యో! తమ కోర్టుకి వాడు సాక్ష్యం చెప్పడానికొస్తాడు కాని మూర్ఛపోవడాని క్కాదు." అంటే "రాస్కెల్ (Rascal!) మళ్ళీ పెళ్ళాం దగ్గిర కూడా జన్మలో అబద్ధం ఆడకుండా చేసేసేను వెధవని వాడి నోటికొచ్చిన కూతలు కూస్తే నమ్మ డానికి. నేనేం జడ్జీననుకున్నావా? జడ్జీ వెధవ ననుకున్నావా? ఒకడ్ని మూడు చెరు వుల నీళ్ళు తాగిస్తే మరి వారంరోజులు ఎవడూ నోరు విప్పడు" అంటూ కాలరు సవరిస్తారు. మొదట్లో నేనూ సరదాకో. చిన్నతనం వల్లో అతనితో వాదించేదాన్ని కాని యిప్పుడు మానుకున్నాను. నా పనైతే చాలు ఎవరెలా పోతే నాకేం అన్న స్టేజ్ (stage) కొచ్చేసేను.

అసలు మా యింట్లో ఆయన్ని ఎవరూ ఎప్పుడూ ఏమీ అడగం. ఎందుకనంటే పొద్దున్నే అడిగితే "తెల్లారకుండా ఏమిటి వెధవ గోల! అయినా ప్రతిదీ నాతో చెప్ప డం ఎందుకు? మీ యిష్టమొచ్చినట్టు ఏడవండి' అంటారు. పోనీ కోర్టుకు వెళ్ళే ముందు చెప్తే "ఐ టోల్డు యు సెవరెల్ టైమ్స్ నాట్ టు డిస్టర్బ్ మి విత్ యువర్ సిల్లీ థి గ్స్ వెన్ ఐ గో

"ఒక పదినిముషాలైంది. ఎలా వుంది పిక్చర్?" సోఫాలోంచి లేస్తూ అడిగాడు.

"ఓ... చాలా బాగుంది....మీరు, నేను కల్సి మళ్ళీ వెళ్దాం అండి...చాలా రష్‌గా వుంది....టికెట్స్ కోసం ఏం తన్ను కుంటున్నారని జనం....అరుపులు, గందరగోళం, తోసుకోడాలు, పాపం పోలీసులు అదుపులో పెట్టలేక సతమత మౌతున్నారు. జనాన్ని తోసుకుంటూ వచ్చేసరికి అరగంట పట్టింది ఈ హడావుడిలో పడి బైటకి వచ్చేసరికి సినిమా చూసినసంతోష మంతా మంచులా కరిగిపోయింది మనం యిద్దరం వెళ్తే ఈ హడావుడేం వుంది హాయిగా కారులో బైట పడచ్చు." గుక్క తిప్పుకోకుండా చెప్పింది మాలిని అతని కోటు గుండీలు విప్పి. కోటు విప్పుతూ,

"ఐ. సి." లేతగా నవ్వాడు మహేష్. "చూద్దాం." అన్నాడు.

"చూద్దాం కాదు, వెళ్ళాల్సిందేగారంగా మారం చేసింది. "ఒ కే." అన్నాడు తప్పించుకోడానికి.

*      *      *

ప్రొద్దున తొమ్మిదిన్నరయింది.

మహేష్‌కి కైకట్టూ "రాత్రంతా ఏమిటండి ఒకటే కలవరింతలు, రాణి, రాణి, "అని...." అంది అతని మొహంలోకి చూస్తూ.

"రాణీ అనా?" ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.

"ఆఁ....బహుశా ఏ రేస్ లో నో పాల్గొని కలవరించారనుకుంటే ఊళ్లో ఏ రేసులు జరగడం లేదు. అప్పుడను కున్నాను కలలో కాని హార్స్‌రేసులో పాల్గొని మీ గుర్రాన్ని ఉత్సాహ పరుస్తూ రాణీ అని పిల్చారేమో అని... నిజమేనా? కలగన్నారా హార్స్‌రేస్‌ల గురించి...." తన ఊహ, నిజమా కాదా అన్న చిత్తంతో, ఏదో కనిపెట్టిన వుత్సాహంతో మెరుస్తున్నాయి కళ్ళు.

ఏం చెప్పాలో క్షణం అర్థం కాలేదు. మహేష్‌కి.

సాయంత్రం ఆరునుంది. తొమ్మిదింటివరకు గడిపిన రాజి గుర్తొచ్చింది. రాజి. రాజి అని కలవరిస్తే తను పొర

---

ఆలస్యంగా యింటికొచ్చే ప్రతి వ్యక్తికి ఏదో ఒక కథ వుండి తీరుతుంది,

నిజం బయటపడిననాడే కథా నాయకుడు కళ్లు తెరుస్తాడు. ఆలస్యం అనే మాటకు యిక జన్మలో తావుండదు.

---

పాటునో. నిద్రమత్తులోనో రాణి వినివుంటుంది.

"నేనడిగిన విషయం చెప్పకుండా ఏమిటా మూడ్డం?"

"అఁ అఁ" ఏం కల అనుకున్నావు మీరు. రాణి అని గుర్రం మీద అడావుథలేగా గెల్చిందిలే రాణి....పెద్దగా అరిచేశానా? పాపం. నీ నిద్ర పాడయిందా?" భుజాలచుట్టూ చేతులేశాడు మహేష్

"నిద్రేం పాడవలేదులెండి మంచి పీక్కకవి లెగుస్తే మీ కలవరింతలు చెవిన పడ్డాయి లేపుదామనుకున్నా కాని పాపం మంచి మూడ్‌లో వుంటారు చెడగొట్టం ఎందుకని వూరుకున్నాను. అరే....మాటల్లో పడి టైం చూసుకోడం లేదు. నైన్ పార్టీ అయింది. ఇంక శ్రీవారు బయలుదేరచ్చు కొలువుకి. చిరునవ్వుతో అంది విడిపించుకుంటూ.

"అరే బాప్... ఒకే డార్లింగ్ బై." అంటూ హడావుడిగా వెళ్ళిపోయాడు కోటు అందుకుని

కారు వెళ్ళిన శబ్దం వినిపించింది బెడ్ రూంలోకి.

"అయితే నిజంగా ఆయనకి రాణి అనే అమ్మాయితో పరిచయం వుందన్నమాట. ట్రాప్‌లో పడ్డారు. తిన ట్రయల్ ఫలించింది. యిఁకెందరున్నారో ఈ కృష్ణ లీలనికి...." నిట్టూర్చింది మాలిని.

"పాపం మంచి మూడ్‌లో వుంటారు చెడగొట్టటం ఎందుకని?"

పైర్ తిరగేస్తున్న మహేష్ చెవుల్లో గింగురు మన్నాయి.

ఆమాటలో కనపడని వ్యంగం వుంది. మరో ఆడదైతె ఎంత గొడవ చేసేది అలా కలవరించినందుకు .... యిందులో ఏదో వుంది. తనకి పెద్దగా గుఱ్ఱపు పందెలకి వెళ్ళే అలవాటుకూడాలేదే. అలాంటప్పుడు తను వాటిని గురించి కలవరించావని అనుకోవడంలో....అర్థం లేదు. తననేదో ట్రాప్‌చేసింది ఏమై వుంటుంది. అని ఎంత ఆలోచించినా అంతు పట్టలేదు. ఆలోచించి తలనొప్పి కూడ వచ్చింది.

"హలో....అంటూ వయ్యారంగా వచ్చింది స్టెనో మంజీరా. అసలే ఆలోచనలతో కొట్టుకుంటున్న మహేష్‌కి ఆ చనువు. ఆ పిలుపు వయ్యారం ఒళ్ళు మండించాయి. "నువ్విచ్చినకొమ్ముకేగా." జ్ఞాపకంచేసింది మనస్సు మరింత మండిపోయాడు. చేసేదిలేక "హలో"అన్నాడు. అలా వున్నారేం? ...సాయంత్రం నన్ను షాపింగ్‌కి తీసుకెళ్ళాలి" గారంగా కోడు మీద కూర్చుని అంది మంజీరా.

"దేనికి?" తలెత్తి సైగా అనుర్చుకున్నట్లు హేస్టైలై చూసాడు. నిన్న చెప్పాను. అప్పుడే మర్చిపోయారు. లుంగి కొనుక్కోవాలని వుంది. కాస్త సెలక్

చేసిపెట్టారని నమ్మంటున్నాను... మూతి ముడుచుకున్నాలా చుట్టింది.

సెలెక్ట్ చెయ్యడానికికాదు. అరె డబ్బు తక్కువైందే అని పర్సుతీసి ఆశ్చర్య పోతుంటె. యిక తప్పించుకునే మార్గం లేక తనజేబులు ఖాళీచేసుకోక తప్పదు. క్రిందటిసారి అలాగేకదూ రెండొందలు వదిలిస్తే. యింకెప్పుడూ యిలా పోటీపడ కూడదని లెంపలేసుకుంది.... జ్ఞాపకం చేసుకున్నాడు మహేష్.

"ఐయేమ్ సారి... యివాళ సాయం త్రం వాక్కొద్దిగఅర్జెంట్ వర్క్ వుంది... ఈసారికి నువ్వు కొనుక్కుందు'' అన్నాడు మీకీమధ్య నామీద నిర్లక్ష్యం ఎక్కువైంది అంత పనికి రాకుండా పోతున్నానా?'' రోషంతొణికిసలాడింది మంజీరా కళ్ళల్లో.

''ఛ... ఛ.... అదేంమాటలు. నిజం నన్ను నమ్మలేవా?''

అతికష్టంమీద కమ్మించచూపినా ఆమె నమ్మలేదు. వారం రోజులనుండి లుంగీ కోసం ఎన్ని కలలుకంది. ఎన్నిప్లాన్స్ వేసుకుంది తల్చుకుంటుంటె ఏడ్పు వచ్చి నంత పనయింది తన వూహలన్ని ముక్కలవడంతో మహేష్‌మీద పీకలమొయ్యి కోపం వచ్చింది.

పెద్దగా శబ్దం చేస్తూ కుర్చీ లాక్కుని టైప్ రైటర్ ముందు కూర్చుంది. తన కోపాన్నంతా ఆ మిషన్‌మీదచూపిస్తూ టైప్ మొదలుపెట్టింది. అయిన మౌనంగా ఫైల్‌ని తిరగేస్తు వుండిపోయాడు మహేష్ నోటీస్ చెయ్యనట్లు. మరింత ఆజ్యం పోసినట్ల యింది మంజీరా కోపానికి. ఏం చెయ్యా డానికి వీల్లేక అలాగే టైప్ చెయ్యసాగింది.

సాయంత్రం యింటికెళ్ళేసరికి అయిదు న్నరయింది. డ్రాయింగ్ రూంలోనే ఎదుర యింది మాలిని ''హలో గుడ్ ఈవ్‌వింగ్'' అంది చిరునవ్వుతో. ''గుడ్ ఈవ్‌వింగ్'' అలసటగా సోఫాలో కూలబడ్డాడు. మహేష్ ''చాలా అలసిపోయారు.... కాస్త డైనింగ్ టేబుల్ వరకు రాగల్గుతే వేడి వేడి పకోడి తాజాగా వేయించిన జీడిపప్పు తినచ్చు.... వస్తారా డార్లింగ్....'' ''నోరూరించె ఐటమ్స్ చెప్పి వస్తారా అని అడగడం ఏమిటిమాలు. వింటెనే నోరు వూరుతోంచి తింటె....''

పోని నోరు వూరించుకుంటె ఏం లాభం? తిని కడుపు చల్లార్చుకోండి." చెయ్యి అందించింది.

వేడి వేడి పకోడితిని. టీ తీసుకున్న తర్వాత సరిగ్గా పక్కమీద పడుకుని ఒక్కొక్క జీడిపలుకు తింటుంటె లోపలి కెళ్ళిన మాలిని తిరిగొచ్చింది.

ఆమెను దగ్గరగా తీసుకొని ''ప్రొద్దున పదినుండి సాయంత్రంవరకు నేను ఫైళ్ళతో కొట్టుకుంటు వుంటాను నువ్వేమో తిరిగ్గా యింట్లో కూర్చుని ఆ నవల్స్ ఈనవల్స్ చదువుకుంటావు రోజంతా ఎంటర్‌టైన్ మెంట్‌గానె వుంటుంది నీకు...''



నేను చిన్నప్పుడోమారు జోస్యం చెప్పించుకుంటే 'గొప్ప పోలీసధికారి వవతావ్-' అని చెప్పేడు-

"అది ఆడవాళ్ళ అదృష్టంలెండి. అది ఈర్ష పడితేవోయేదికాదు." నవ్వింది మాలిని 'ఈరోజుల్లో అందరాడవాళ్ళు యింట్లో కూర్చోవడంలేదు మీలాగ....పాపం ఎంత మంది ఆడపిల్లలు ఎండనక వాననక, బస్సుకి క్యూలో నిలబడి, తలనొప్పివున్నా. ఒళ్ళునొప్పులున్నా డ్యూటీకి వస్తున్నారు. ఆఫీసర్ తల వాచేలా చివాట్లుపెట్టినా జవాబు చెప్పకుండ నిలబెట్టారు. కాని మీలాంటివాళ్ళు కట్టుకున్నవాడు పన్నెత్తి మాటనగానె ఎక్కడలేని రోషం. కోపం, మూతి బిడాయింపులు, అలకపాన్పులూ బతిమాలుకోడాలు" ఒకచేంబర్మ చెప్పు.. పడరాని పాట్లన్ని పడేలా చేస్తారు....

కళ్ళు వెడల్పు చేసుకుని. బుగ్గలు సొట్టలుపడేలా ఒత్తుకుంటూ "అయ్యహో! ఏమి ఈ అకారణ దయాసముద్రము తరుణులపై....ప్రమదలపై ఈ కరుణా వృష్టికి ఏమి కారణమోకదా.... సెలవిత్తురా అగ్రజా!" అని అడుగుతుంటె పక పక నవ్వి... కాదా! రోజు ఆఫీసుల్లో చూడడం లేదూ!"

"అదా సంగతి! అంత దయపడేవారు పేదతీర్చలేకపోయారు!"

ఆమె ఏభావంతో అన్నా అది మహేష్‌కి వ్యంగ్యంగాను, హేళనగాను వినిపించింది.

"వాళ్ళకి పేదతీరుస్తుంటె నాగతేం కావాలి! యింతకీ యివాళ రోజంతా రాణీ గారి కార్యక్రమమేమిటో!"

"ఏమిలేదు. రజి ఏదో నవల యిస్తే చదువుతుంటున్నాను. నవలమాత్రం చాలా బాగుంది"

"ఏమిటో...."

"వెరిసింపుల్. ఒక అమ్మాయికి ఒక అబ్బాయికి పెళ్ళి అవుతుంది. పెళ్ళయ్యాక అబ్బాయిసంగతి అమ్మాయికి తెలుస్తుంది"

"ఏమని?" కుతుహలంగా అడిగాడు.

"ఏముంది. అబ్బాయిగార్లో శ్రీకృష్ణుడి అంశ వుందని...." ఫక్కున నవ్వింది మాలిని అతను మాత్రం నవ్వలేదు.

"ఊహుం....అప్పుడేం జరిగింది?"

అమ్మాయి అంటె హీరోయిన్ చాలా తెలివైనది అతని జేబుల్లో మల్లెల దండలు చూసిన సెంటు పూసుకుని, మల్లెపూల లాంటి బట్టలేసుకుని హుషారుగ బయట కెళ్ళిన మనిషి యింటికి....అదేలెండి అర్ధరాత్రి వచ్చేసరికి చిత్తుగా నలిగిపోయి వుండెవాడు మనిషి. బట్టలమూట రాత్రి అడ్డమైన ఆడవాళ్ళపేర్లు కలవరించేవాడు మహానుభావుడు. అయినా హీరోయిన్ పట్టించుకునేది కాదట...." అదేం? మొగు డంటె యిష్టంలేదా? నవ్వాడు మహేష్. యిష్టంలేకేం బోలెడుంది. యిష్టంవేరు. వాళ్ళ గుణగణాలుమీద అభిప్రాయం వేరు. వాడెంత దుర్మార్గుడయినా మొగుడయ్యాక ప్రేమలేకపోయినా భాధ. జాలి స్త్రీకి తప్పవు.

"అయితే హీరోయిన్‌కి హీరో మీ జాలి. బాధ వుందా?"

"అవి వుంచుకుని చేతులు ముడ్చుకుని కూర్చోలేదు లేండి పూర్వకాల పతివ్రత లాగ...."

'పతివ్రతలంటే అంత హేళన తగదు మాలు. మీ కన్నా ఎక్కువే వుద్ధరించారు వాళ్ళు. యింతకీ ఆ నవీన పతివ్రత ఏం చేసిందో.'' హేళన తొణికిన లాడింది అతనికి కళ్ళల్లో. ఉడుక్కోకుండా నవ్వేంది మాలు.

"ఆ ప్రొసెస్ అంతా ఎవరు చెప్తారు యిప్పుడు. మీకు వీలైనప్పుడు చెప్పండి. పుస్తకం యిస్తాను. విశదంగా చదువుకో వచ్చు. పెళ్ళి చూపులకి వచ్చినప్పుడు పని చెయ్యని కళ్లు బుర్ర పెళ్ళి అయిన మరునటిరోజు నుంచి ఎలా పని చేస్తాయో తల్చుకుంటే చాలా ఆశ్చర్యం వేస్తుంది. యింత ఆలోచనా రాహిత్యం. బుద్ధి వికసతలేని మనిషిని కట్టుకున్నానా అని ముందట్లో చాలా బాధపడింది. అంత నీతి. జాతిలేని వాడితో కాపురం చెయ్యా లంటేనే ఒంటికి కారం పూసుకున్నట్లు ఫీలయ్యేది. ఆ మనిషికి తన భార్యని చెప్పుకోడం కన్నా తల కొట్టేసుకోడం వుత్తమంగా అన్పించేదట."

"ఇంతకి ఏ విధంగా అతన్ని జయించిందో చెప్పనే లేదు." అనహానాన్ని అణుస్తూ మధ్యలోనే అడుకున్నాడు మహేష్.

"ఏం చేసిందో తెలుసా ... అరే ... మర్చే పోయాను సుమా! స్టౌ మీద పాలు పెట్టి వచ్చాను. ఈ పాటికి సగం పాలు పోయే వుంటాయి...." అంటూ ఒక్కుదుటన వంటిట్లోకి పరిగెత్తింది మాలిని.

నిర్వచించలేని ఉద్వేగంగా, కుతూహలంగా వుంది మహేష్‌కి.

అతని ఆరాటానికి తగినట్లు మాలిని అరగంటకి కాని తిరిగిరా లేదు.

మరో రెండు నిముషాలు అయితే మంచం మీద నుంచి లేచి పోయేవాడే.

కాని అభిమానం అడ్డు వచ్చింది.

నిదానంగా కూని రాగాలు తీస్తూ వచ్చింది మాలిని. "మీ కోసం ఎవరో వచ్చారు."

అతని ప్రాణానికి, ఆ సమయానికి అది చావు కబురులాగే వినిపించింది.

విసుగ్గా లేచి వెళ్ళాడు.

ఆ వచ్చిన మహానుభావుడు జీడి బంక లాగే రాత్రి ఎనిమిదిన్నర వరకు వదల్లేదు

రాత్రి భోజనాలు చేస్తుంటే మళ్ళీ జ్ఞాపకం వచ్చింది.

"అన్నట్లు ఆ నవల పూర్తి చెయ్యనే లేదు....ఏమయింది చివరికి?" కుతూహలం అణచి పెట్టుకున్నాడని గ్రహించిన మాలినికి నవ్వొచ్చింది.

కింద పెదవిని నొక్కి పెట్టి 'మీకంతగా ఆ నవల గురించి జ్ఞాపకం వుందంటే నిజంగా అది గొప్పనవలే. అలాంటివాన్ని నోటితో చెప్తే ఏం బాగుంటుంది ప్రఖ్యాత రచయిత్రి కాబట్టి సంఘటనలను కళ్ళకు కట్టినట్లే కాకుండా ఎంతో సహజంగా, హృదయ రంజకంగా చిత్రించింది నాకేం వస్తుంది అలా చెప్పడం....చదువుకుందురు." అంది

యింక అడిగిన లాభం లేదని తెల్సు మహేష్‌కి పుస్తకం అడగడానికి మనస్కరించక పూరుకుండి పోయాడు.

ఇంటి శుభ్రం మీద, వస్తువులను వాటి స్థానాల్లో వుంచడం చిన్నప్పట్నుంచి శ్రద్ధ ఎక్కువ. మాలినికి. అందుకనే బి.యస్సీ

---

ఒక సినిమా థియేటర్ కొత్త పాడయినందున, ప్రదర్శన రద్దు చేశారు. ఈ విషయాన్ని హాలు ఆర్టిస్టు హాలు బయట పోస్టరు కాగితంపై 'ప్రకటన'గా వ్రాస్తున్నాడు. ఒక ముసలాయన అయన్ను సమీపించి, "ఈ హాలులో ఏం జరుగుతుందండీ!" అని ప్రశ్నించాడు.

"మరమ్మత్తు" అన్నాడు ఆర్టిస్టు పరధ్యానంగా.

"ఇంతకీ తెలుగా, హిందీయా?" అని ప్రశ్నించాడు ముసలాయన!

లో హోమ్‌సైన్స్ తీసుకోమని స్నేహితులు ప్రోత్సాహన చేశారు. ఉడుక్కున్న మాలిని "రేపు మీకు పెళ్ళిళ్లు కాక పోతాయా. చీపుళ్ళు, గుడ్డలు పట్టుకుని యింటిని శుభ్రంగా వుంచడానికి బయలు దేరక పోతారా? అప్పుడివేం కబుర్లు గుర్తుండవు....గుర్తున్నా బాధ్యత తెలియని వయస్సులో వున్నప్పటి కబుర్లు పట్టించుకుంటే ఎలా అని సర్ది పుచ్చుకోక మానరు...." అంటూ వాళ్ళని ఓడించి బి. యస్సీలో బయలాజికల్ గ్రూప్ తీసుకుంది.

షెల్ఫ్‌ని శుభ్రపరుస్తున్న మాలినికి ఆ రోజులు గుర్తొచ్చాయి.

"ఎంత హాయైన రోజులు. చీకు చింతా, బాధ్యతలు, బరువులు లేని స్వేచ్ఛ బతుకు. పొద్దున ఎనిమిది గంటలకి లేచినా తీరుబడిగా కాలేజీకి చేరుకుని, సరదాగా తోటి పిల్లలతో చదువు. ఆటలతోగడిపి ఇంటికి అలిసిపోయి రాగానే వేడివేడికాఫీ టిఫిన్లు" కాసేపు సరదాగా కబుర్లు, భోజనం తర్వాత నిద్ర వచ్చేవరకు చదువుకోడం, రికార్డ్సు వెయ్యడం....ఈ లెక్చరర్ యిలా అనేది. ఆవిడలా అందేమిటి అని చర్చించుకోడం....వ్వ... వ్వ.... గమ్మత్తైన లైఫ్....ఆ జీవితం అంతే. ఆటలు. సినిమాలు. షికార్లు. శ్రద్ధగా చదువుకోడంతోటి గడిచి పోతుంది.... ఇప్పుడో...."

"అమ్మగారూ....ఫోన్ వచ్చిందండి."

ఉలిక్కిపడి ఫోన్ దగ్గరకి వచ్చింది. ఫలాన ఫైల్ షెల్ఫ్‌లో వుంది, ప్యూన్ని పంపుతున్నాను, పంపమని ఫోన్ చేశాడు మహేష్. మరో పదిహేను నిముషాల్లో ప్యూన్ ప్రత్యక్షమయ్యాడు. ఫైల్ తీసి షెల్ఫ్ అంతా దుమ్ముగా వుండడం చూసి శుభ్రం చేస్తుంటే ఎన్నో కాగితాలు,పుస్తకాలు కన్పించాయి. ఎప్పుడు చూడనివి.

"ఇదేగా మొదటిసారి దులపడం కాపురానికి వచ్చాక...." అని జ్ఞాపకం చేసుకుంది మాలిని.

ఎందుకంటే ఆ షెల్ఫ్ జోలికి మాలినికి వెళ్ళద్దని చెప్పాడు. అన్ని పుస్తకాలు. కాగితాలు గుర్తుగా పెట్టుకున్నాను. నువ్వు కలిపేస్తావు....అంటూ హెచ్చరించాడు.

తీసిన చోటే తిరిగి పెట్టేస్తూ షెల్ఫ్ శుభ్రం చెయ్యసాగింది.

చివరగా వున్న పుస్తకాన్ని బయటికి తీసి దులుపుతుంటే ఎవో కవర్లు, కాగితాలు పడ్డాయి. రంగు రంగులుగా వున్నాయి.

ఏమిటబ్బా అని తీసి చూస్తే ఏముంది.

లవ్ లెటర్స్.

"బాప్‌రే....లవ్ లెటర్స్....చాలా వున్నాయే....వీళ్ళంతే పెళ్ళి కాక ముందు గర్ల్ ఫ్రెండ్సా....శ్రీవారు వీళ్ళందరికి

హీరోవా? చాలా మంచికి హీరోన్న మాట....”

తిరిగి అన్నిటినీ జాగ్రత్తగా పెట్టి షెల్ఫ్ మూసేసింది.

“అబ్బా-ఏం దుమ్మండి మీ షెల్ఫ్‌లో ఒకటే తుమ్ములు తలుపు తెరవగానే.... మీ పుస్తకాల్ని ఎవరు తియ్యకుండా శ్రీరామరక్ష ఆ దుమ్ము....” రాత్రి పడుకున్నప్పుడు అంది మాలిని.’

‘అంటే?”

“అంటే ఏముంది ఆ దుమ్ము చూసి హడలు పుట్టి దాని ఛాయలకి కూడా రారు....”

“చిన్నవరు వెళ్ళమన్నారు. అక్కర్లేని పన్ని నెత్తిన వేసుకుంటావు.... అయినా.”

“అబ్బబ్బ.... వెళ్ళద్దని చెప్పారు లెండి.... అంత దుమ్ముగా వుంటే వూర్కో బుద్ధి కాలేదు.”

అతనికి ఛటుక్కున లెటర్స్ సంగతి జాపకం వచ్చింది. అనుమానంగా మాలిని వైపు చూశాడు అవిగాని చూపించేమోనని.

కాని ఆమె మొహం ప్రశాంతంగా వుంది. కళ్ళు ఎప్పటిలా మెరుస్తున్నాయి.

ఎలా అడుగుతాడు?

చూసి కూడా అలా ప్రవర్తిస్తోందా మాలిని అన్న సందేహం వచ్చింది.

నటిస్తోంది....ఆశ్చర్యం క్షణ క్షణా నికి పెరుగుతోంది.

'ఏమిటలా చూస్తున్నారు...' గోముగా చూస్తోంది మాలిని.

చూసిందేమో ...చూసిందేమో....యిదే అనుమానం గిర్రున తిరుగుతోంది

"ఏం లేదు" కూడ తీసుకుంటూ అన్నాడు.

"తలనొప్పిగా వుందా?" మృదువుగా నుదుటిమీద చెయ్యి వేసింది.

"లేదు...."

"చిరాగ్గా వుందా?" అనునయింపుగ వుంది గొంతు

"ఊహూ...."

"పోనీ...ఎక్కైన మనస్సు మళ్ళిందా?"

అప్పుడే కళ్ళుమూసుకున్న మహేష్ చటుక్కున కళ్ళుతెర్చాడు. పరిహసిస్తోందా? అసహనంతో. అసహాత్యంతో పిచ్చెక్కి నట్లయింది. లేదు. విద్రోస్తోంది... మృదు త్వాన్ని కొని తెచ్చుకుని కళ్ళు మూసు కున్నాడు. తిరిగి ఆతని తీరు వింతగా తోచింది. మరింకేం మాట్లాడకుండ లైటార్పి పడుకుంది మాలిని.

ఆరోజు సాయంత్రం మహేష్, మాలిని టిఫిన్లు తింటున్నారు

"యివాళ మా హిస్టరీ దగ్గర్నుంచి లెటర్ వచ్చింది...."

"హిస్టరీ ఏమిటి?" తెల్లబోతూ చూశాడు మహేష్.

ఫక్కున నవ్వి "ఐయామ్ సారి.... అలవాట్లో పొరపాటు ...మా ఫ్రెండ్ పేరు చరిత , ముద్దుగా దాన్ని యింగ్లీష్‌లో ట్రాన్స్‌లేట్ చేసి హిస్టరీ అని పిలుస్తూ వెక్కిరించేవాళ్ళం....దానికీమధ్య మొగుడు దొరికాడు లెండి అతని గురించి పదిహేను తావుల వుత్తరం వ్రాసింది...." మహేష్ నవ్వి కొత్తలో ఆడవాళ్ళు అలవాటేగా.... నువ్వు మీవాళ్ళకి. ఫ్రెండ్స్‌కి అన్ని తావులు వ్రాసిన దానివేగా?" వెక్కిరించాడు

"అనుకోండి. దానిగోడు వేరు.... నిట్టూర్చింది

"ఏమిటో స్పెషాల్టి.. "

"పాపం అమ్మాయిల వెనక వాళ్ళ సౌందర్యారాధనచేస్తూ తిరుగుతాడట.... యిదేం ఖర్మ సంసారిక జీవితం మొదలు పెట్టిన మొదట్లోనే నీకలలు కల్లలయి పోయాయేం అంటుగోలపెట్టూ వ్రాసింది"

ఐయామ్ వెరీసారి టు నోట్ దట్. " ఫార్మాల్టిని మాత్రం భార్యదగ్గర కూడ మర్చిపోయాడు మహేష్.

"యిట్సాల్ రైట్....పాపం నలహా సహాయం అడుగుతోంది....ఏం యివ మంటారు?" తిరిగి మహేష్‌లో ఘర్షణ....

డాడీ! త్వరగా దాక్కో!
మమ్మీ ఇటే వస్తోంది!!



తనని వెక్కిరిస్తోందా.... తిరిగి గుండెలో రొద...

''నాకేంతెల్సు?...'' అన్నాడు తేలిగ్గా తీసుకుంటున్నటు.

''అలాకాదు మొగాళ్ళ విషయం మొగాళ్ళకిఎక్కువ తెలుస్తుంది. కాస్తేదైనా సహాయం చేస్తే నాస్నేహితురాలు మీపేరు తల్చుకుంటుంది. ఎంతైనా ఆడపిల్ల మిమ్మల్ని తల్చుకోవడం గొప్ప చూడండి'' వదిలిపెట్టలేదు మాలిని. ''యిది మరీ బాగుంది. నీ వుద్దేశం ఏమిటో చెప్పు అన్నాడు ఏంఅనాలో తెలియక.

'నన్నడుగుతే అది పట్టించుకోకుండ. అతనుచేసేపన్లనువిమర్శించకుండా వుంటె సిగ్గుపడి అతనే కొన్నిరోజులో మానేస్తా దని.''

''దేనికి సిగ్గుపడటం?'' ఆశ్చర్యంగా అడిగాడు తలెత్తి.

''తనచేసే పన్లకి భార్య ... త విమ్మకు నీరెత్తినట్లు వుంటె ఔమానంకాదు? తన

తింటూ చున్నది తనమీద ఆధారపడి వున్నది తనన. తన పన్లని విమర్శించుకుని తననో మూర్ఖుడికింద జమకట్టి పట్టించుకోకుండా వుంటె అవమానంకాదు? నోటితో కాకుండ అతితెలివిగ మౌనంతో అతని పన్లని నిర్లక్షపరుస్తె ఫూల్ చేసినట్లుకాదు? యిన్నిందుకు తనకి పరాయిస్త్రీతో సంబంధం వుందని స్పష్టంగా తెలిసికూడ ఏడ్చి గగ్గోలుచేసి బెంబేలుపడిపోయి, బతిమాల్తు, తిరస్కరిస్తె కుళ్ళిపోతూ కాకుండా ఏం పట్టనట్లు నవ్వుతుంటె త్వరలో అతనే ఆశ్చర్యపోతు ఏమిటా అని ఆలోచిస్తు త్వరలోనె నిజం తెలుసుకుంటాడు ఏమంటారు?''

మాలిని మాటలు వింటున్న మహేష్ ఆలోచన జల్లులో వుక్కిరి బిక్కిరయాడు. తన కారణమె। నిజమన్నట్లు పందెం వేసుకుంటునట్లు ఏవేవో ఆలోచనలు ఒకటిని మించి ఒకటి అతని మెదడులో అతి వేగంగా పరిగెడ్తున్నాయి.

''మాట్లాడరేం?'' అతని మెడచు చేతులు వేసింది.

''ఔనౌను...చాలా బాగా చెప్పావు., యిదె రాసెయ్యి స్నేహితురాలికి...' ఎలాగో అన్నాడు మహేష్ నిలదొక్కుకుంటు.

''రాయాలి...'' అంది మూసుకుపోయిన కనురెప్పలతో ఆవలిస్తు.

మర్నాడు మహేష్ ఆఫీస్‌కి వెళ్ళిపోయాడు. పన్లన్ని ముగించుకుని, క్రిత రోజు సగంలో వదిలేసిన పుస్తకాన్ని చదవడానికి బెడ్‌రూంలోకి వెళ్ళింది.

టేబిల్‌మీద పుస్తకాన్ని చేతుల్లోకి తీసుకోబోతు ఆగింది మాలిని పత్రిక పక్కనే నల్లని అట్టమీద గోల్డెన్ లెటర్స్‌తో డైరీ అని మెరుస్తోంది. మాలిని కను బొమ్మలు ముడిపడాయి.

"డైరీ ఆయిన మరో ప్రాణమె. అది యిక్కడ ఎప్పుడూలేనిది యింత నిర్లక్షణంగా వదిలెయ్యడానికి కారణం ఏమిటి?''

మరో క్షణంలో ఆమె కిందపెదివిని మునిపళ్ళకిందకి లాక్కుంది.

'ప్రయత్నంగా' ఆమెచెయ్యి డైరీ మీదకి వెళ్ళింది. కళ్ళు ఉత్సాహంగా, ఏదో తెల్సుకోవాలన్న కుతుహలంతో ఆత్రంగా డైరీలోని అక్షరాల్ని హడావుడిగా తమలో కరిగించుకుంటున్నాయి. దాదాపు నలభై నిముషాల తర్వాత డైరీ మూసేసి యధాస్థానంలో పెట్టేసింది.

మంచంమీద వాలి పత్రికను తిర్చింది, కాని మనస్సు కొండమీదనుండి కిందకి వురికె ప్రవాహంలో మెదడు మరో విషయాల్ని దొర్లిస్తోంది. పుస్తకంమూసి పక్కన పడేసి కళ్ళు మూసుకుంది మెదడును సహకరిస్తు. సాయంత్రం యింటికొచ్చిన మహేష్ ఆదుర్గాగా డైరీ పెట్టినచోటువైపు చూశాడు పెట్టింది పెట్టినట్లె వుంది...

మాలిని డైరీ చూడలేదా? చూసినా నిరాసక్తిగా వదిలేసిందా? లేక చదివి యధాస్థానంలో పెట్టేసిందా?....ఆలోచిస్తూ నిలబడ్డ మహేష్ వులిక్కిపడ్డాడు.

"ఓహ్...శ్రీవారిపోజ్ చాలా బాగుంది. చేతిలో కెమెరా లేకపోయింది కాని లేకపోతే...." అల్లరిగ వెనకనుండి ముందుకి వచ్చింది మాలిని.

అతని దృష్టి డైరీమీద వున్నట్లు గమనించింది.

"అన్నట్లు యివాళ మీరెండో ప్రాణం యిక్కడే వుండిపోయిందేమిటి మీతో తిగకుండా? ఆమె మాటలు డైరీ నుద్దేశించె అని గ్రహించాడు మహేష్. అనుమాదం మరింత చిక్కనయింది.

"మర్చిపోయానుమాలు...అంటూ దాని పైపుగా నడిచి డైరీ తీసుకుని కాజువల్‌గా తిప్పి జేబులో పెట్టుకున్నాడు

వెనక్కి తిరుగుతూ "ఎందుకో జేబుల్లో చేతులు పెట్టుకుంటె డైరీ విషయం జ్ఞాపకం వచ్చింది... తర్వాత యిక్కడ పెట్టి మర్చిపోయానని జ్ఞాపకం వచ్చింది...

"పాపం, నొచ్చుకుని వుంటారు...."

"లేదు. ఎందుకంటె యింట్లో శ్రీమతి కదా తిరిగేది ...చూసినా ఫర్వాలేదనే సరి పెట్టుకున్నాను చూశావా?" ఓరగా మాలిని కళ్ళల్లోకి చూశాడు.

చూడటం ఏమిటి? డైరీ చూడకూడదనె నీతి తెల్సినా ఆడైరీ నా ప్రాణేశ్వరుడని పొద్మాల్టికి పక్కకి తన్ని నాక్కావల్సినది చూశాను..." నవ్వింది మాలిని స్వచ్ఛంగా

"ఐ సి ఏం చూశావు? నవ్వాడు మహేష్ కాని కళ్ళు ఆ తాన్ని దాచలేక పోయింది. నేను చెప్పకూడదు .... మీరు వినకూడదు...."

---

ఒకసారి ఫారెస్ట్ ఆఫీసర్ ఆఫీసులో ఉన్నప్పుడు జవాన్ హడావుడిగా పరుగెత్తుకుని వచ్చి ఇలా అన్నాడు.

"సార్! సార్! ఓ పులి మీ ఇంట్లోకి వెళ్ళి మీ ఆవిడ మీదకు దూకింది. త్వరగా రండి సార్ వెళ్ళదాం."

"ఆఁ ...ఏం వెళ్ళటం లేవోయ్" అన్నాడు ఆఫీసర్ నిర్లక్ష్యంగా.

"ఏమిటి సార్! అలా అంటారు అక్కడ ఒకరి ప్రాణం పోతూ ఉంటే?" అన్నాడు ఇంకా తొందరగా జవాన్

"ప్రాణం పోతేపోని లేవయ్యా! వెధవ ఆ పులి చస్తే మాటకేముస్తుందని!" అన్నాడు ఆఫీసర్ నిదానంగా

—కె. ముకుందర్, హిందుపురం.

అంటు దగ్గరగా వచ్చి అతనికళ్ళల్లో కళ్లు పెట్టి ఓలిపిగా చూస్తూ "ఇవాళ శనివారం మబ్బుగా వుంది వాతావరణం ఇంట్లోనే టు మెంబర్స్ కాక్‌టైల్ పార్టీ కరేంజ్ చెయ్యమంటారా?''

అలా దగ్గరగా వున్న ఆ కళ్ళలోకి చూస్తూ ఎన్నో అడగాలని. తన అనుమా నాలన్నీ తీర్చుకోవాలని మరేదో ఊహ లతో అతని అంతరంగం ఎగిసెగిసి పడుతోంది.

దాన్ని అణుస్తూ "వెరీవెల్. రాణి గారుకూడ పార్టిసిపేట్ చేస్తానంటే కావ ల్సిందేముంది?'' అన్నాడు ఉత్సాహం కొనితెచ్చుకుంటూ.

''మీ మొగవాళ్ళు దేనికైనా తగు దురు సుమా! అలనాడు సతీ సావిత్రి మొగుణ్ణి తలమీద పెట్టుకుని వేశ్య ఇంటి దాకా మోసుకెళ్ళింది. సీతమ్మ చెయ్యని నేరానికి నిప్పులో దూకింది. పుట్టినప్ప ట్నుంచి పుట్టెడు వైభోగాన్ని అనుభవిం చిన ద్రౌపది మొగుళ్ళకోసం సైరంధ్రి వృత్తి చేసింది. ఈనాడు సాధారణమైన నేను నా భర్త సంతోషంకోసం తాగక పోతానా?'' ప్రశాంతమైనవాతావరణంలో వురుకు పరుగులతో ప్రవహించే నదీమ గలగలలు జ్ఞాపకం వస్తాయి ఆమె మాట లను వింటుంటే. ఎంతో విజ్ఞానంగా, హాస్యంతో జోడించి మాట్లాడుతుంటే ఆమె ముందు ఫూల్ అయిపోతాడు మహేష్.

మాలిని ఏదో బట్టలు కొనుక్కుంటా నంటే ఆ రోజు సాయంత్రం యిద్దరూ వెళ్ళారు కారులో.

షాప్‌లో అడుగు పెట్తూనే వులిక్కి పడ్డాడు.

లుంగీల డిజైన్లను చూడడంతో మునిగివున్న మంజీర. అసిస్టెంట్ మానే జర్ రావ్‌తో....అతని వైపు తిరిగి ఏదో హడావుడిగా మాట్లాడేస్తోంది.

సతీ సమేతంగా లోపల ప్రత్యక్ష మయిన బాస్‌ని చూసి తడపడ్డాడు. రావ్.

''గు....డ్ ఈవ్‌నింగ్ సార్....'' తడపడ్డాడు ఆ విధంగా పట్టుపడి పోయి నందుకు గంభీరంగా తిరిగి విష్ చేశాడు మహేష్.

చటుక్కున తలెత్తి చూసింది మంజీర మరుక్షణంలో అప్పటిదాకా తొక్కిన లాడుతున్న వుత్సాహం. సంతోషం ఆవి రయి పోయాయి.

విష్ చెయ్యక తప్పలేదు....ప్రైవేట్ ఫరమ్. ఏం చేసినా అడిగేందుకు లేదు. ఈ కక్షతో అతను వూస్టుచేసినా దిక్కు లేదు....బాధపడి పోయింది మంజీర ఆ విధంగా అతని కళ్ళపడ్డందుకు.

భర్తలో మార్పుని క్షణాల్లో కని పెట్టిన మాలిని ఏదో వుందని మాత్రం ఊహించింది.

మర్నాడు ఆఫీస్‌లో మంజీరా అతన్ని కదిలించడానికి చాలా విధాల ప్రయత్నాలు

చేసింది. అతని మొహంలో గాంభీర్యం మంజీరను ముందడుగు వెయ్యనివ్వలేదు ఆమె అసలు విషయం బయట పడ్డాక ఆమెను కల్సుకోడం కూడా అసహ్యమనిపించింది. అతను తనతో చనువుగా వుండకపోయినా తన వుద్యోగం పోగూడదని దేవుణ్ణి కోరుకుంది.

అవసరాలకోం, డబ్బుకోసం ప్రేమించే వాళ్ళల్లో నీతి ఆశించడం తన మూర్ఖత్వమే అని మంజీరను ప్రశ్నించడం. పంజాయిషీలు అడగటం మానేసాడు.

ఆ రోజు మధ్యాహ్నం అతని ముఖ్య స్నేహితుడి దగ్గర్నుంచి వుత్తరం వచ్చింది.

"డియర్ మహేష్ ...

కులాసా అని తలుస్తాను.

జరగరాని అన్యాయం జరిగింది. ఇన్ని రోజులు ఊపిరికి ఊపిరి, ప్రాణంలో ప్రాణంలా వుండే రాణీ నన్ను మోసం చేసింది. యిన్ని రోజుల వరకు నీలాంటి వాడు ఈ పద్నాల్గు లోకాల్లో లేడని మురిసిన ఆ కళ్ళకి ఈ నాడూ దేనికి పనికిరాని వెధవగా కనిపిస్తున్నాను. ఇన్ని రోజులు నా కళ్ళకి కప్పి మిగతా రాస్కెల్స్‌తో తిరుగుతోందని అనుకోలేదు. మొన్న టాంక్ బండ్‌లో పట్టుపడింది అవన్ని ఎందుకు. నువ్వు అదృష్టవంతుడివి ఆడపిల్లను మరిగిన నువ్వు పెళ్ళి చేసుకున్నావు మాలినిగార్ని చేసుకుని మరింత అదృష్టవంతుడి వయ్యావు. రూపము చదువు ముఖ్యంగా తెలివితేటలు వున్న ఆవిణ్ణి చేసుకోడం నిజంగా నీ అదృష్టమే. ఆవిడ తెలివి తేటలు నీకెలా తెల్సనే అనుమానం కల్గచ్చు మంచి చెడుదాగే విషయాలుకాదు. విన్నాను. కొందరి ద్వారా. కాని నువ్వు విప్పుతో చెలగాట మాడ్తున్నావు పెళ్ళయినా పాత బుద్ధులు పోక పోతే ఎలా? మాలినిగారు నువ్విలా ఇంకా తిరుగుళ్ళ గాడివనే విషయాన్ని తెల్సుకుంటే ఏం బాగుంటుంది?"

రత్నం కన్నా మిన్న అయిన మాలిని

గారిలాంటి భార్య దొరికితే యింకా ఈ ఆడదానెందుకు? నా మాట విను. బాధ్యతలు, బరువులు లేనప్పుడు ఎంత మందితో ఎలా తిరిగినా ఫర్వాలేదు. యిప్పుడైతే నీ భవిష్యత్తుకి నీ ప్రవర్తనే అడ్డుగా నిలుస్తుంది. ప్లీజ్ నోట్ యిట్.

వీలైతే త్వరలోనే వస్తాను.

విత్ బెస్ట్ విషెస్.

రవి

"ఉత్తరం మడ్చి జేబులో పెట్టుకున్నాడు మహేష్ రెండోసారి చదివి.

రాత్రి ఎనిమిదయింది. మాలిని వంట గదిలో వుంది.

ఏదో ఫైల్ చూస్తూ దిండుమీద వాలబోయిన మహేష్ వులిక్కిపడ్డాడు. దిండు క్రిందనుండి సగం, సగం కన్పిస్తున్న కాగితాలు.

కూడదు అనుకుంటూనే తీసాడు మహేష్.

మొదటి రెండు మూడు పేజీలు మామూలు కబుర్లతో నిండిపోయింది.

నాలుగో పేజీలో....

"చరితా ...ఎంత పిచ్చిదానివే.... ఎవరో వున్నారు ఆయనకి అంటూ అమ్మమ్మలా ఏడ్చి గగ్గోలెత్తే బదులు దారికెలా తేవాలో ఆలోచించలేవా? ఇంట్లో అన్ని విధాల ఆన్నాయి వున్నప్పుడు మరోళ్ళతో తిరుగుతున్నాడంటే ఎంత నీతి, జాతి, లేనిమనిషో. ఎంత చంచల మనస్కుడో ఆలోచించలేక పోయావు! మనిషి విలువని గుర్తించలేని మనిషితో కాపురం చెయ్యడం కష్టమని నేను ఒప్పుకుంటాను. గుండెలు బద్దలవుతున్నాయి అని రాసావు. అది ఒప్పుకుంటాను. ఆడపిల్లలం. సున్నిత మనస్కులం. సూది మొన గుచ్చుకుంటే బల్లెం, గుచ్చుకున్నట్లు బాధ పడ్తాం. ఒంటికే కాదు గుండెల విషయంలో కూడ సుమా!"

నీ పిచ్చి కాని నీకు యింకా యీ మొగాళ్ళ తత్వం ఏమిటో అర్థం కాలేదు. కీలెరిగి వాత పెట్టాలి దేనికైనా. తమని ఎవరైనా అందులోకి భార్య తన పన్లెగిగి కూడ నిర్లక్షంగా. పట్టకుండా తిరుగుతోంది. తనెలా పోయినా ఫర్వాలేదా ఔరా దీని పొగరేమి అని ఆలోచించక మానరు ప్రతీకారంతో ఒళ్ళు సలసల కాగిపోతుంది ఏం చెయ్యాలి, ఎం చెయ్యాలి అని తర్జన భర్జనలు పడ్తారు. చివరికి భార్యని మాటల్లోకి. తర్కాల్లోకి దింపుతారు ఈ విషయాలని దృష్టిలో పెట్టుకుని అప్పుడున్నాయి అసలు నీ తెలివి తేటలు. ఘాటుగా ఝాడించి పారెయ్యి అన్ని విషయాలు కల్పి వచ్చేలా చివరికి ఆం.... కాలేజీలో చదువుకున్న ప్రతివారికి అపోజిట్ సెక్స్‌లో స్నేహం లేకుండా ఎలా వుంటుంది అన్న ఆ ఒక్క ముక్క వదిలెయ్ మరీ ఆయన మంద శరీరంగల

వాటయితే....సాగతీసి అల్లరి పెట్టే వాడ యితే కొన్ని ప్రికాషన్స్ తీసుకో....మరీ డైరెక్టర్‌గా అనటోకు యిలాగే అల్లుకుపో ఆతవి కసలు అదృష్టం అంటూ మిగులుతే అతగాడు మారుతాడు లేదా.... ఖర్మ చరమదశలోనైనా నీ కాళ్ళు పట్టుకోక మానడు. అది తప్పదు.

ఆ మాట కొస్తే అందరు మగాళ్ళు అంతేనేమో .. మా ఆయనకి ఆ పిచ్చి కొద్దిగా వుంది. అయినా నేను పట్టించు కోను. ఆ మనిషి కసలు సంస్కారం, విజ్ఞానం లేవు. మనుషుల విలువ అంత కంటే తెలియదు. అవి సరిపెట్టుకున్నాను. ఏం చేస్తాం ఎవడి ఖర్మ వాడిది. ఖన కొన్ని కనక సింహాసనం మీద కూర్చో పెట్టినంత మాత్రాన బుద్ధి మ రుతుందా అన్నట్లు... జన్మతో వచ్చిన పాడు బుద్ధి ఎన్ని డిగ్రీలు సంపాదించినా వస్తుందా? ముద్దు లొలికే ముత్యం లాంటి భార్య వస్తే మాత్రం పోతుందా? ..."

మహేష్ చదవటం ఆపేసాడు. "అంటే మాలిని వుద్దేశంలో తను నీతి జాతిలేని వాడా? తన బుద్ధి శునకబుద్ధితో పోల్చడం....ఎంత అవమానం....ఆమె దృష్టిలో తనంతగా జారిపోయాడా?.... పిల్లేదు....భార్య దగ్గర యింత పరా భవమా....తన మీద ఆధారపడి వున్న మాలిని తనని మౌనంగా నిర్లక్ష పర్చడమా .... ఏదోలా అనిపించింది మహేష్‌కి.

ఆవేశం తగ్గాక రవి వుత్తరం జ్ఞాపకం వచ్చింది. నీ ప్రవర్తనే నీ భవిష్యత్తుకి అడ్డుగా నిలుస్తుంది. ఔను....మంజీరా ఎంత మోసం చేసింది....తన చేత అలం కారపు వస్తువులన్నీ కొనిపించిన మంజీరా "నిన్ను క్షణక్షణం మనస్సులో పూజిస్తు న్నాను మహీ నువ్వు లేక పోతే బతక లేను" అని డైలాగులు అప్పచెప్పిన పిరు. నువ్వు మర్చిపోయినా నేను మర్చిపోలేను మహేష్ అందుకనే పెళ్ళి మీద ఇంట్రస్టు పోయింది అని నీతి వాక్యాలు వల్లించిన రణి వారం క్రితం పెళ్ళి శుభలేఖ పంపింది. వీళ్ళంతా....తనతో ఆడుకున్నారు.... తనతో వీళ్ళంతా కాక రాణి రవితో ఆడు కుని మోసం చేసింది. స్త్రీలను అందులోకి పెళ్ళికాని ఆడపిల్లల్ని అసలు నమ్మ కూడదు. కళ్ళు పూడుకుపోయి యిన్ని రోజులు గోతిలోపడ్డాను.

ఆ తర్వాత ఎప్పుడూ మహేష్ ఇంటికి ఆలస్యంగా వస్తానని చెప్పలేదు. అతను ఒక్కసారిగా మారలేదు. కాస్త కాస్తగా మారుతున్న మార్పుకి రవి వుత్తరం, మంజీర ప్రవర్తన దోహద కారులుగా పనిచేసాయి.. చదితకి మాలిని రాసిన ఉత్తరంలోని సారాంశం అతనిలోని విపే కాన్ని మేల్కొలిపింది.

# ఎక్కడుంది? మానవత...

—ముద్రగడ సూర్యప్రకాశరావు

మానవులం మనం మతి తప్పి
గతులు తప్పుతూ తప్పు తప్పు
భావనలకు రూపాలు దిద్దుకుంటూ
మనల్ని మనమే వంచించుకుంటున్నాం
మనసుల్ని చంపుకుని మట్టిలో కలుపుకుంటున్నాం.
ఏదీ? మానవత? ఎక్కడుంది?
కథల్లోనూ కవితల్లోనూ
శాసనాల్లోనూ. ఉపన్యాసాల్లోనూ తప్ప
మరెక్కడా కనిపించదేం?
మరే కంఠంలోనూ వినిపించదేం?
ఇంటిని చక్కబెట్టుకోలేని మనం
మింటికెగరాలని ప్రయత్నిస్తున్నాం
సుఖజీవనాన్ని ఊహించుకుంటూ
చిత్రించుకుంటున్నాం మోడ్రన్ ఆర్ట్‌లా
కలలో శాంతి కనిపించి పలుకరిస్తే
ఆనందంతో ఉప్పొంగిపోతున్నాం
శాంతి సౌభాగ్యాల ననుభవించలేకున్నాం మనం
మన హృదయాల్లోని కంపన. మనస్సుల్లోని మృగత.
మమత. మానవత్వాలపై ముసుగును తప్పేసింది
ఏం చేస్తున్నామో? ఏమైపోతున్నామో!
తెలుసుకోలేని స్థితిలో ఉన్నాం మనం.
మనుగడకు అర్థం తెలీని మన మనసుల్లో ఎలా ఉంటుంది మానవత?
పుస్తకాల్లోనూ, శాసనాల్లోనూ తప్ప..........



# మనిషి చేసిన మేలు

(పెద్దకథ)

రచన బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

(గత సంచిక తరువాయి)

మర్నాడు సింహాద్రి "నా చొక్కా కట్టడమయిపోయిందా" అనుకుంటూ కొట్లోకొచ్చాడు. సింహాద్రి ఊళ్ళో ఒక వ్యాపారస్తుడు. వయసు నలభై అయిదేళ్ళుంటాయి. వామనవాయగా, లావుగా, పొట్టిగా వుంటాడు. బట్టతలవల్ల బుర్రమీద వెంట్రుకలు లేవు గాని ఇంట్లో బోలెడు డబ్బుంది. పొట్ట చీరితే అక్షరం లేదుగాని రెండంతస్థుల మేడవుంది. చర్మం ఊడదీసి చూసినా ఎక్కడా మంచితనమన్నది లేదు గాని ఊళ్ళో మంచి వడ్డీవ్యాపారముంది. దేవుడిచ్చిన కళ్ళున్నాయిగాని ఆ కళ్ళకందరూ కనబడరు తనకుపయోగపడేవాళ్ళే కనిపిస్తారు. చేతులున్నాయిగాని ఆ చేతులు మనుషుల్ని నాశనం చెయ్యడమేగాని ఏనాడు ఎవరికీ బాగుచేసిన పాపాన పోవు. కాళ్ళున్నాయిగాని అవి యింట్లో తప్ప బయట పడవ్వు (సింహాద్రికి లాంబ్రెట్టా స్కూటరుంది) అతని బుద్ధి వాతు లాంటిది. మంచి పదునైంది. వస్తువు ఎక్కడ మెత్తగా వున్నదీ చప్పున తెలుసుకుని అక్కడ కోత పెట్టగలడు. ఎదటివాడి కళ్ళలోకి చూసి వీడి పెళ్ళాం బతికుందా చచ్చిందా. దాని శ్రాద్ధకర్మకి వీడి దగ్గర డబ్బుందా లేదా. చప్పున నిర్ణయించగలడు. ఎదటివాడి మొహంచూసి వీడి ఇల్లు తగలబడిందో లేదో. వీడి పెళ్ళానికి క్షయవ్యాధి పట్టుకుందో లేదో వీడింట్లో వంటానికి బియ్యంగింజలున్నాయోలేవో. వీడి పిల్లలకి బడి జీతాలు కట్టాడో లేదో చప్పున పోల్చుకోగలడు.

"ఏం వీరాస్వామి నా[illegible] నా చొక్కా-

కట్టేవా లేదా'' అంటూ సింహాద్రి కొట్లో కొచ్చి బల్లమీద కూర్చున్నాడు.

''ఆ. కట్టడమయిందిగాని యింకా ఇస్త్రీ చెయ్యలేదు. ఇప్పుడే మరి అర్జంట యితే కూర్చో. ఇస్త్రీపెట్టె వెలిగిస్తాను. లేకపోతే సాయంత్రమొచ్చి తీసుకెళ్లు''

''మళ్ళీ సాయకాలం వస్తాలే. ఐనా ప్రతిదీ వాయిదా వెయ్యడంలో నీ తర వాతే.''

''అంటే ఏమిటయ్యా నీ ఉద్దేశం!''

''ఏం లేదులే. ఏదో తమాషాకన్నా''

''అదృష్టవంతుడివి. ఎన్ని తమాషా లేనా చేస్తావు.''

ఎవరైనా అదృష్టం పేరెత్తితే సింహాద్రి వేదాంతపరమైన చిన్న లెక్చ రిసూ వుంటాడు. ''అదృష్టం- దుర దృష్టం- ఏదైనా మన సేతిలో ఏటుం దయ్యా వీరాస్వామీ. అంతా ఆ ఆంజ నేయస్వామి చలవే అనుకో. ఆ స్వామి చలవవుంటే మేడలు కడతావు. లేకపోతే మన్నై పోతావు. ప్రతి మంగళవారం టెంకాయెందుకు కొడతాననుకున్నావ్ మరి? తోటలో కాసిన కాయలే అనుకో. అయినా డబ్బుకాదేటి? ఇప్పుడు కాయ ఏభై అరవై పైనలమ్ముతూంది తెల్సా? కొబ్బరి పంటంటే ఏటి, బంగారమే అనుకో. అయినా వారం వారం ఆ స్వామికి కొబ్బరికాయ కొట్టాల్సిందే.

ఆయన దయలేకపోతే పదెకరాల పొలం ముప్పయెకరాలెలా అయింది? సైకిలు స్కూటరుగా ఎలామారింది? ముప్పయి వేల రూపాయలు వడ్డీలకెలా తిప్పుతున్నా నంటావ్? అంతా ఆ స్వామి చలవే నయ్యా. లేకపోతే ఊళ్ళో ఇంతమంది దరిద్రులెందుకుంటారు. అల్లు మనకాడకి అప్పులకెందుకొస్తారు? ఆ స్వామి చలవ మనమీదుంటేనేకదా ఊ రోళ్ళు అళ్ళ పెళ్ళాల చెవుల తమ్మెట్లు తెచ్చి మన కాడ తాకెట్టెడతారు. ఎమంటావ్? అంతా ఆ స్వామి చలవేనయ్యా. లేకపోతేనువ్వు బతుకంతా మిషను కుట్టుకుంటున్నట్లుగా నేను చింతపండువ్యాపారం చేసుకుంటూ వుండేవాడ్నే. ఏమంటావ్? ఏం వీరా స్వామీ. వింటున్నావా లేకపోతే నీమా నాన్న నువ్వు మిషను కుట్టుకుంటున్నావా,

''వింటున్నానయ్యా- నువ్వన్నదీ నిజ మేలే. రూపాయికి పావలాలు వడ్డీపుచ్చు కునే వాళ్ళమీదే వుంటుందా దేవుడిదయ. చొక్కా-కుట్టి రూపాయి కూలి పుచ్చుకునే వాళ్ళమీదెందుకుంటుంది?'' అన్నాడు వీరాస్వామి తన వేదాంతోపన్యాసంమీద వీరాస్వామి వ్యాఖ్య సింహాద్రికినచ్చలేదు.

'ఛీ. నీకు దేవుడూలేడు. దెయ్యమూ లేదు అందుకే అప్పటికి ఇప్పటికీ ఒక్క లాగే వున్నావు. ఆ దేవుడందుకే మని షిని చూసి దబ్బిస్తాడు. కనిపించిన ప్రతి వాడికీ యిచ్చేస్తాడా?''

''ఇవ్వడయ్యా. నీ లాటి వా డి కే యిస్తాడు.''




"అద్గదీ అలా అను. వీరాస్వామీ నాకు డబ్బుకేం లోటులేదు, కానీ...."

"ఇంకా మరి కానీ ఏమిటి?"

"మీకు తెలుసుకదా నా పెళ్ళాం చచ్చిపోయి ఏడాదయింది."

"డబ్బున్నవాడికి పెళ్ళాం చచ్చిపోతే లోటేమిటి? ఇంకో పెళ్ళాన్ని కొనుక్కురావచ్చుగా?"

"ఛ, అదికాదయ్యా నేననేది. నువ్వూ నేనూ ఓ కులస్థులం. అక్కయ్య వేరే కులందే అనుకో ఆయినా మీ రిద్దరూ భార్యాభర్తల్లాగ మర్యాదగా కాపరం చేస్తున్నారు. ఇంతకీ నా కలాంటి పట్టింపులేం లేవు సుమా! మీ అమ్మాయి కమల బుద్ధిమంతురాలు, చదువుకుంది. పెళ్ళి చేసుకోడానికి నాకేం అభ్యంతరం లేదు" అంటూ మెల్లగా తన మనసులోని ఉద్దేశం బయట పెట్టేడు సింహాద్రి.

"నీ కభ్యంతరం లేకపోవచ్చుకాని మాకుంది" అన్నాడు వీరాస్వామి ప్రతి మాట నొక్కి పలుకుతూ. సింహాద్రి ఇలాంటి జవాబు వస్తుందని అనుకోలేదు. తనంతగొప్ప వాడు కోరి పిల్లనడిగితే ఎగిరి గంతేసి ఒప్పేసు కుంటాడను కున్నాడు. సింహాద్రి బుర్ర చాకులా పదునైనదేగాని, చాకనేది ఎలా నీరు, గాలి మొదలైన పదార్థాలను కొయ్య లేదో, అలాగే తనతో ఏకీభవించని వాళ్ళనీ, తన స్వార్థానికి ఉపయోగ పడని వాళ్ళనీ అర్థం

చేసుకోలేదు అందుకనే అతనికి ఎనరీ తంగా కోపం వచ్చింది.

"ఏం. ఎందుకనీ? మీకేం తీసిపిగేసిందా ఏభై వేల రూపాయల ఆస్తి వరుడ్ని అల్లుడుగా నువ్వెక్కడైనా తేగలవా? నాకేసి లోటని? ఇంతకీ మీరేటి నూసుకుని విర్రవీగుతున్నారని? నీ కూతురు చదుకుందనా మీ గర్వం. వీరాస్వామీ నేచెప్పేది ఇను. వదువుకున్నోడికంటె వాకలాడు మేలని ఎందుకన్నారు మనోళ్ళు. నాకు చదువు లేదు నిజమే. అయితేనేం? నాకున్న వ్యవహారజ్ఞానం ఎవరి కుందయ్యా? ఎన్ని దావాలు గెలిచానూ, ఎంత మందిని కట్టుకొచ్చానూ, ఎంత వ్యాపారం చేస్తున్నానూ "ఏమైనా ఆలోచించావా? నీ కూతురు చదువుకుంది నిజమే కాని ఏటిసేస్తూంది. పంతులమ్మ ఉద్యోగం సేస్తూంది. రేప్పొద్దున్న నేను ఎన్నికల్లో నిలబడతాను. మెంబరయి తీరుతాను. అప్పుడిలాంటి పంతులమ్మ లరడజను మందికి ఉద్యోగాలే యిస్తాను తెలుసా?" అంటూ సింహాద్రి శపథం చేశాడు.

"సింహాద్రీ, ఎందుకొచ్చిన వాదనిదంతా చెప్పు. అది నిన్ను చస్తే చేసుకోదు. పిల్ల దానికిష్టంలేని పెళ్ళి నేను చెయ్యను," అన్నాడు వీరాస్వామి.

సింహాద్రికి ఒళ్ళు మండింది. తన వేదాంతోపన్యాసమూ మంచి మాటలూ ఏమీ ఈ వీరాస్వామి దగ్గర పనిచెయ్యవు. ఇక బెదిరిస్తే కాని జరగదనుకున్నాడు.

"అయితే చెయ్యనంటావ్. ఓహో నరే, నీ మొండి పట్టుదలేమిటో నేనూ చూస్తాను."

"ఏం పీక తీసేస్తావేఁటి?"

"అదే, అదే. నీ కూతురికి పెళ్ళెలా చేస్తావో నేను చూడనా? నీ సంసారం గుట్టంతా నాకు తెలీదా? పార్వతమ్మ మొగుడు చచ్చిపోయాక చంటిపిల్లతో నీ దగ్గర చేరడం, మీరు పెళ్ళి పేరంటం లేకుండా కాపరం వెలిగించడం-యిదంతా నాకు తెలీదనుకున్నావా? ' అని సింహాద్రి అనగానే, వీరాస్వామి మిషనాపి లోపలికెళ్ళాడు.

పార్వతమ్మ ఈ మాటలన్నీ గదిలోంచే వింటూ బయటి కొచ్చింది. ఆవిడ సింహాద్రిని పురుగుని చూసినట్టు చూస్తూ "ఛీ. నోరుముయ్యి నీకెందుకు మా గొడవ? నువ్వు మమ్మల్నేం పోషిస్తున్నావా? అంత మర్యాదలేని వాళ్ళమైనప్పుడు మా పిల్లని చేసుకుంటానని ఎందుకొచ్చావ్? వెళ్ళు బయటికి నడువు ముందు" అంటూ కోపంతో ద్వారం వేపు చెయ్యి చూపించింది. ఇంతలో వీరాస్వామి లోపలి నుంచో కర్ర పట్టుకుని వచ్చాడు.

"వెళ్తాలే అమ్మా. ఇదంతా మీ మంచి కోసమే చెబుతున్నాను" అంటూ సింహాద్రి వీరాస్వామి చేతిలో కర్ర చూసి చల్లారిపోయాడు.

"మా మంచి మేం చూసుకోగలం


NEW! SUPER
Surf

వెళ్ళవయ్యా మా పిల్లని మా యిష్టమొచ్చి నట్టు చేసుకుంటాం. నీ కెందుకా గొడవ. వెళ్ళు. ముందు బయటికెళ్ళు" అంది పార్వ తమ్మ.

వీరాస్వామి కర్రని నేలకొకసారి కొట్టి ఆ కర్ర ఎంత గట్టిదో ఒకసారి చూపిం చాడు.

"సింహాద్రీ నీ గుట్టు నాకూ తెలు సయ్యా. నువ్వెన్ని నీచాలు చేశావో నాకూ తెలుసు కాని మా జోలికి నువ్వు రాకపోతే నీ జోలికి మేమూరాము. నువ్వు నన్ను బెదిరించాలనుకుంటే, ఇదిగో ఇటేటో చూశావా ఈ కర్రతో తన్నులు తింటావు. తెలిసిందా. నా సంగతి నీకు తెలీదు సింహాద్రీ. నువ్వు మంచిగా వుంటే నేనూ మంచోడ్నే. బెదిరించావాజాగ్రత్త. ఎముకే లిరగ్గొడతాను. నీలాంటి వాళ్ళని చాల మందిని చూశాను. తెలుసా ఇంకెళ్లు- ఊ—బయటికి నడువు. వెళ్తావా లేక పోతే దీన్తో ఒక్కటి ఒడ్డించమంటావా;" అంటూ కర్రెత్తేడు వీరాస్వామి.

సింహాద్రి భయంతో గజగజ వొణికి పోయాడు.

"బాబోయ్, కోట్టకురా వీరాస్వామీ, నువ్వూ నేనూ ఏదో ఓ కులమోళ్ళంగా బట్టి మాటవరస కన్నాన్రా. తన్నకురా పోతాను" అంటూ కొట్లోంచి ఒక దూకు దూకి బయటపడ్డాడు సింహాద్రి.

"ఒరే సింహాద్రీ ఇదిగో ఇలారా" అన్నాడు వీరాస్వామి. సింహాద్రి వీధిలోనే నిలబడి వెనక్కి తిరిగి చూశాడుగాని కొట్లోకి రాలేదు. కొట్లో కొస్తే తంతా డేమోనని భయం. వీరాస్వామి సింహాద్రి చొక్కా చుట్ట చుట్టి "ఇదిగో నీ చొక్కా, పో. పట్టుకుపో" అంటూ విసిరేశాడు సింహాద్రి చొక్కా అందుకుని గబగబ రోడ్డు దాటి స్కూటరెక్కి వెళ్ళి పోయాడు.

* * *

ఆదివారం నాడు రామారావు లక్ష్మిని మోటారు సైకిలు మీద తన స్వగ్రామా నికి తీసుకెళ్లేడు

ఆ గ్రామం పట్నానికి దగ్గరలోనే వుంది. ఊళ్ళోకి వెళ్ళాలంటే ఏరుదాటాలి వర్షకాలంలో కూడా ఏట్లో నీరు ఎక్కు వగా వుండదు. ఎడ్లబళ్ళూ మనుషులూ నీటిలోంచే నడచి వెళ్ళి పోతూవుంటారు. గ్రామ ప్రజలు త్రాగేనీటికి ఈ ఏరే ఆధారం ఏటి వొడ్డున మామిడితోపులూ సరుగుడు తోటలూ దట్టంగా వున్నాయి. ఏరూ, ఏటి ఒడ్డున పెద్ద మర్రి చెట్లు, వాటి దిగువ పావంచాలు, ప్రక్కనేగ్రామం ఏటికి యింకో ఒడ్డున మామిడి, సరు గుడు తోటలూ ఈ మనోహరమైన దృశ్యం చూస్తూ నిలబడిపోయింది లక్ష్మి. రామారావు మోటారు సైకిలు నీట్లోంచి మామిడి తోటలో పెట్టివచ్చాడు. లక్ష్మి చెయ్యి పట్టుకుని నీటిలోంచి నడిపిస్తూ ఏరు దాటించాడు. ఏరుదాటి "అమ్మయ్య.




నేనివే మొదటిసారి నీట్లోంచి నడవడం. అందుకే ఎంతో సరదాగా వుంది. కాని భయం కూడా వేసింది'' అన్నది లక్ష్మి. "భయమెందుకూ నీ చెయ్యి పట్టుకునే వున్నానుగా.'' అంటూ నవ్వేడు రామారావు. లక్ష్మి కొంచెం సిగ్గుపడింది. ఇద్దరూ నడుచుకుంటూ ఊళ్లో కొచ్చారు. రామారావు ఇల్లు డాబా ఇల్లు. విశాలమైన ఆవరణ. ఆవరణలో బంతి మొక్కలు విరగబూసి వున్నాయి.

లక్ష్మి ఆవరణలోని పూలమొక్కలన్నిటినీ శ్రద్ధగా చూసింది. ''ఈ తోట ఇంత శ్రద్ధగా ఎవరేశారు'' అన్నది లక్ష్మి.

''నేనే వేశాను.మాపనివాడి సాయంతో కాని శ్రద్ధగా వెయ్యలేదు. ఇక్కడి మొక్కలు అడ్డదిడ్డంగా అడివిలో పెరిగినట్టు పెరిగాయి.'' అన్నాడు రామారావు.

''కాని ఈ తోట ఎంతో సహజంగా అందంగా ఉంది' అన్నది లక్ష్మి.

ఇంట్లోంచి రామారావు తల్లి తలుపు తీసుకుని బయటి కొచ్చింది. ''ఏంరా రామం ఇప్పుడే వచ్చావా? బయట నిలుచున్నావేమిటి? లోపలికి రండి'' అన్నది.

''అమ్మా, ఈవిడ లక్ష్మి నాతో కలిసి చదువుకుంది. టీచరుగా పని చేస్తూంది.

"రామ్మా, లోపలిరండి'' అంటూ రామారావు తల్లి లక్ష్మి చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకెళ్ళింది.

(సశేషం)




అనగనగా ఓ ఊరుంది. ఆ ఊళ్ళో ఒకానొకచోట ఒక చిన్న ఇల్లుంది. ఆ ఇంటి మేడమీద రెండు గదులున్నాయ్. ఆ రెండు గదుల్లోకి నిన్ననే ముగ్గురు బైరాగి పిల్లకాయలు ప్రవేశించారు. వాళ్ళల్లో ఒకరు విద్యార్థి ఒకరు చిరుద్యోగి; ఇంకొకరు నిరుద్యోగి, వారి నామధేయాలు వరసగా గోపాలం, విశ్వనాథం, సూరిబాబులు.

గోపాలం ప్రతీరోజూ వేళ తప్పకుండా

వాళ్ళు ముగ్గురూ ఒకే ఊరివాళ్ళు. చిన్నప్పట్నుంచీ ఒక కంచంలోతిని ఒక మంచంలో పడుకోకపోయినా, ఒకే స్కూలులో, కొంతవరకూ ఒకే కాలేజీ లోనూ చదువులు వెలగబెట్టారు తరువాత ముగ్గురిదార్లూ వేరయినా, ఒకేఊళ్ళో, ఒకే గదిలో, నివసిస్తున్నారు. ఇంకా చెప్పాలంటే ఒకే హోటల్లో భోంచేస్తారు. ఒకే బ్రాండు సిగిరెట్టు కాగుతారు.

ఆవాళ ఉదయమే. మొదటగా నిద్ర లేచిన గోపాలం దంతధావనం చేసు కుంటూ, రూములోంచి బయటికొచ్చి నీఅబడి పరిసరాలు పరికించటం ప్రారం భించాడు. "ఇంజినీరింగు కాలేజీలో చేరినప్పటినుంచీ బ్రతుకు మరీ బోరుగా ఆయిపోయింది బాబూ!" అనుకున్నాడు. కాదుమరి! వాళ్ళ కాలేజీలో వెతుకుదామన్నా ఒక్క ఆడ పురుగైనా కన్పించలేదు.

"ఇంతకు ముందన్న గదీ అంతే! మరీ వెధవకొంప! ఎదిరింట్లో ఓముసలి బామ్మగారూ, అటువైపింట్లో మహా కాయురాలైన ఓ మహాలక్ష్మమ్మగారూ, ఇటువైపింట్లో బురఖా ధరించే తురక బూబమ్మ తప్పిస్తే, గులాబీలాంటి ఒక్క ఆడపిల్లయినాలేదు" అని కూడా అను కున్నాడు గోపాలం

ఆ చిన్నవాడు కనీసం ఈకొత్తస్థలంలో నయినా తన కోరిక తీర్చమని తిరపతి వెంకన్నని ప్రార్థించేదేమో. తపస్సుకి మెచ్చిన వరంలా ఎదురుగా డాబా ఇంటి మేడమీది గది కిటికీలో ఓ సీతాకోక చిలుక బయటికి చూస్తూ కన్పించింది.

గోపాలం అటూ ఇటూ చూశాడు- ఎవరేనా ఉన్నారేమోనని. తను తప్పిస్తే ఎవరూ ఉన్నట్లులేదు. కాబట్టి ఆ సుంద రాంగి తనవైపే చూస్తూండాలని రూఢి చేసుకున్నాడు. ఆ పిల్లముఖం అప్పుడే చెట్లోంచి తెంపుకొచ్చిన గులాబీపువ్వులా ఉంది, ఆ కళ్ళల్లో ఏదో దిగులు ఉంది- ఎవరికోసమో నిరీక్షణ ఉంది. 'నాకోసమే' అన్పించింది గోపాలానికి, అతగాడి మనస్సులోంచి "నీకోసమే!...నీకోసమే" అంటూ ప్రతిధ్వనించింది. అంతలో గదిలోకెవరో వచ్చారు కాబోలు లోపలికెళ్ళి పోయిందా చిన్నది.

ఇంతలో గుర్తొచ్చింది గోపాలానికి ఆవాళ స్పెషల్‌క్లాసు ఉన్న విషయం. "ఈ వెధవలిద్దర్నీ త్వరగా లేపి, హోటలు అయ్యర్ను దర్శిస్తేగానీ క్లాసుకి అంద కోలేను" అనుకుంటూ లోపలికెళ్ళి సుప్ర భాతం సాగించాడు.

అటు తరవాత మిత్రులు ముగ్గురూ కడుపులు నింపుకోటానికి హోటలుకి బయలు దేరారు, ఆమేడ కిటికీలోంచి కన్పించిన సుందరి ఏమైనా క్రింద కని పిస్తుందేమో చూదామని, గోపాలం మిత్రులిద్దరి కంటే ముందే మెటుదిగేశీ వీధిలోకొచ్చాడు, ఎందుక అమ్మా




యిలవైపు ఇలా చూపులు విసిరేయటం లాంటి వేషాలు విశ్వనాథానికి నచ్చవు.

"అనవసరంగా గొడవచేస్తాడు-వీడు చూసేదంటే" అనుకుంటూ ఆ ఇంటివైపు చూశాడు. వరండాలో పిట్టగోడ నానుకుని చిరునవ్వు ముఖంతో నిలబడి ఉందా సుందరి, ఇంకేముంది! 'ఏదో ఒకటి చేసెయ్యాలి! ఈ పిల్లతో ఎల్లాగైనా స్నేహం చెయ్యాలి! ఈమెలేని నా బతుకు కాల్చనా?' అనుకున్నాడు గోపాలం నాటక ఫక్కీలో.

వెనకనే సూరిబాబూ, విశ్వనాథం గది తాళంవేసి బయలుదేరి గోపాలాన్ని కలుసుకున్నారు.

గోపాలం అటునించి అటే కాలేజీకి వెళ్ళిపోయాడు. విశ్వనాథం, సూరిబాబూ ఇంటిదారి పట్టారు. ఇంటి ముందుకిరాగానే కాస్తంత దిక్కులు చూసే అలవాటున్న సూరిబాబుకి, ఎదురింటి గుమ్మంలోంచి లోనికెళ్తున్న ఓ జవ్వని బారుజడ కన్పించింది. ఆ జడలో మల్లెలు ఎవరికోసమో వేచి చూసి విసిగినట్లుగా వాడి పోయి ఉన్నాయి. "ఎవరీ అభిసారిక?" అనుకున్నాడు.

మేడపైకి ఎక్కాక, విశ్వనాథం తలుపు తాళం తీస్తున్నప్పుడు, సమయం చూసుకొని, ఆ ఇంటివైపు చూశాడు సూరిబాబు. మేడమీద కిటికీలోంచి, వాలుకుర్చీలో కూర్చుని ఏదో ఆలోచిస్తోన్న ఓ అప్సరస కన్పించింది. "అజద

తాలూకు అభిసారిక తాపదేశాలోలు" అను కున్నాడు. ఇంతలో ఆవిడ కిటికీ దగ్గర కొచ్చి నిలుచుంది. సూరిబాబు కామెకళ్ళు రాత్రంతా జాగారం చేసినట్లు ఎర్రగా కని పించాయి. ఇంతలో లోపల్నుంచి విశ్వ నాథం దేవికో పిలవటంతో గబుక్కున గదిలో దూరాడు. "పీడొకడు కీచకు డిలా!" అనుకుంటూ.

శీఘ్గా మంచంమీద పడుకుని వార్తా పత్రిక మొదటి అక్షరంతో మొదలుపెట్టి. తొమ్మిదిమ్ముక్కాలు అయేదాకా తన శక్తి మేరకు చదివేసి ఆఫీసుకి బయలుదేరాడు విశ్వనాథం. మెట్లుదిగి కిందికొచ్చి. కింది భాగంమందు నిలబడి 'కృష్ణమూర్తిగారూ' అని పిలిచాడు. సదరు కృష్ణమూర్తి ఆ ఇల్లుగలవారి పుత్రుడు. విశ్వనాథం సహో ద్యోగి. ఇంతకు ముందున్న గది ఖాళీ చేయాల్సివొచ్చినప్పుడు ఈ శాస్త్రిద్వారానే మేడమీది గదల్లో ప్రవేశించారు మన మిత్రత్రయం. 'వస్తున్నానండోయ్' అంటూ చెప్పులేసుకుని బయటికొచ్చాడు కృష్ణమూర్తి వచ్చినవాడూరుకోక ఎదు రింటివైపో చూపు విసిరేశాడు. సరిగ్గా అదే సమయంలో విశ్వనాథం కూడా అటే చూశాడు. ఇద్దరికీ పిట్టగోడనానుకుని చిరునవ్వుముఖంతో నిలుచుని ఉన్న ఎదు రింటి అమ్మాయి కన్పించింది.

ఆ పిల్ల ఎవేపు చూస్తోందో, కృష్ణ మూర్తివేపు చూస్తోందో, లేక ఇద్దరివేపూ చూస్తోందో విశ్వనాథానికి అర్థంకాలేదు.

ఆ సమయంలో అతనికా అమ్మాయిమీద జాలేసింది 'ఆ అమ్మాయి తండ్రి నా లాగే ఓ ఎన్. జి. వో కాబోలు. పెళ్ళి చెయ్యలేక ఎదిగిన కూతుర్ని అల్లాగే ఉంచుకున్నాడు. అయినా ఓ అమ్మాయీ! నువ్వెలాంటి పరిస్థితుల్లో ఉన్నప్పటికీ. మా ఇద్దరిలోనూ ఎవరివైపు చూసినా ప్రయోజనం శూన్యం. వీడికి ఆర్నెల్ల క్రితమే పెళ్ళయింది. ఇక నేనంటావా! నాకు పెళ్ళికావలసిన చెల్లెళ్ళున్నారు. వాళ్ళి ద్దరి తరవాతే నాకు ప్రమోషను' అనుకు న్నాడు తనలో తాను.

ఇలా మిత్రులిద్దరూ తమతమ పనుల మీద వెళ్ళిపోగానే. సూరిబాబు రోజూ లాగే పరుపుక్రింద దాచుకున్న ఏ డిటె క్టివ్ పుస్తకాన్నో, సెక్సు పత్రికనో బయటికిలాగి తన ఉద్యోగాన్ని తమవిర్వ హించేవాడు. కానీ ఇవాళ అతని మనస్సు పవిమీద లగ్నం కావటంలేదు. ఆలో చనలన్నీ ఎదురింటి అభిసారిక చుట్టూ తిర గటం ప్రారంభించాయి.

అయినా పట్టుదలగా ఓ పుస్తకాన్ని తెరచి ఏదో కథని ప్రారంభించాడు. '....... ఆ కిటికీ దగ్గర నిలబడి ఎది రింటి వరండాలో ఉన్న రామేశంవైపే తదేకంగా చూస్తోంది కమల. ఆమె కళ్ళు ఎర్రగా ఉబ్బి ఉన్నాయ్. వాటిలో భరించ లేని వాంఛా, తాపమూ పెల్లుబుకుతోన్నాయ్ ఆమె బుగ్గలు ఉద్వేగంతో ఎర్రబడి వున్నాయ్. ఎర్రటి దొండపండ్లలా వున్న

ఆమె పెదవులు మోహావేశంతో కంపిస్తున్నాయ్. రామేశాన్ని తన దగ్గిరకి రమ్మని పిలుద్దామని చిన్నగా చెయ్యి ఎత్తబోయింది. ఇంతలో అతను ఆమెవైపు చూడకుండా లోనికెళ్ళిపోయాడు.......'

ఇంక వదవలేకపోయాడు సూరిబాబు 'చచ్చుపీనుగ! పరువంలోవున్న ఆడది పిలిచేదాకా అర్థంచేసుకోలేనివాడూ మగాడేనా!' అనుకున్నాడు ఇంతకు ముందు కిటికీలో కనిపించిన ఎదురింటి అభిసారిక గుర్తొచ్చింది. మళ్ళీ కనిపిస్తుందేమోనని ఆ ఇంటివేపే చూడడం సాగించాడు.

సాయంత్రానికి సూరిబాబు నిరీక్షణ ఫలించింది. అయిదు గంటలకి సరిగ్గా ఎదిరింటి అమ్మాయి కిటికీ దగ్గిర కొచ్చి నుంచుని. ఒక్కచూపు ఇటుపారేసి సందు చివరి వైపుకి చూడసాగింది. 'నేను ప్రొద్దున్న చూపింది అభినయం కాదు. ఆమె నన్నుచూడాలనే మేడమీదికొచ్చింది అనుకున్నాడు సూరిబాబు. అదే సమయంలో కాలేజీనించి తిరిగొచ్చిన గోపాలం మేడ మెట్లు ఎక్కుతూ, ఎదిరింటి కిటికీలో, ఆ సుందరిని చూసి, సరిగ్గా సూరిబాబు అనుకున్న మాటలే అనుకున్నాడు. ఆ ఇద్దరూ అలా ఎంతసేపా అమ్మాయిని చూస్తూఉండిపోయేవారో కానీ, కింద వీధిలో విశ్వనాధం మాటలు వినిపించటంతో, 'గురువుగారొస్తున్నార్లా ఉంది' అనుకుంటూ లోపలికెళ్ళిపోయాడు గోపాలం.

మన వాళ్ళిద్దరికీ అలా దర్శన మిచ్చిన ఆ అమ్మాయి. విశ్వనాధం కృష్ణమూర్తితో కలిసి ఇంటి ముందుకి సరిగ్గా వచ్చేసరికి, కింద వాళ్ళింటి వరండాలో ప్రత్యక్షం పమింది, 'ఈ పిల్లకేదో రోగంలా ఉంది.

---

సూటులో ఉన్న ఒక తను 14 అంతస్తుల భవనం గేటు దగ్గర ఆగి, అక్కడే ఆడుకుంటున్న పన్నెండేళ్ళ అబ్బాయిని పిలిచి,

"అబ్బాయీ! ఫలానా బ్రిగేడియర్‌రావు గారిల్లు చూపగలవా?" అని అడిగాడు ఆ అబ్బాయి, వెంటనే తల వూపి తాతను అనుసరించమన్నాడు. వారిద్దరూ అత్యధిక ప్రయాసతో 12 అంతస్తులూ ఎక్కి చెమటలు కక్కుతూ ఒక ఇంటి దగ్గర ఆగారు.

అబ్బాయి: ఇదేనండీ! బ్రిగేడియర్ రావుగారిల్లు.

సూటు :- అయితే, ఇంటికి తాళం వేసుందే! ఆయన ఎక్కడికి వెళ్ళారు!

అబ్బాయి:- ఆయన క్రిందనే ఉన్నారండీ! ఆ గేటు పక్కనే నిల్చుని సిగరెట్టు కాలుస్తున్నాయనే నండీ, బ్రిగేడియర్ రావుగారు!

—సి. వెంకటేశ్వర్లు, కొరబ్బూరు పాడి.

అనుకుంటూ ఇటు తిరిగి చూశాడు విశ్వనాథం. ఏం ఉందీ—కృష్ణమూర్తి ఆపిల్ల వైపు దొంగ చూపులు చూస్తోన్నాడు. విశ్వనాథానికి వళ్లు మండింది.'' చక్కగా పెళ్ళి చేసుకుని వీడికిదేం పోయేకాలం' అనుకున్నాడు. అదే మాటని పైకిఅనేంత చనువులేదు కృష్ణమూర్తి దగ్గిర. అందుకని నోరు మూసుకుని పైకి వెళ్ళి పోయాడు.

ఆవాళ సాయంత్రం అంతా పెద్ద విశేషం అంటూ ఏమీ జరగలేదు. ఎందుకంటే చెప్పానుగా అమ్మాయిల వైపు దొంగ చూపులు చూడటం వాళ్ళనిగురించి చర్చించటం లాంటివి విశ్వనాథానికి నచ్చవని. అందుకే సూరిబాబూ. గోపాలం బుద్ధి మంతుల్లా ఉండిపోయారు. ఇంతకీ వాళ్ళిద్దరూ విశ్వనాథాని కంతగా ఎందుకు భయపడాలీ అంటే దానిక్కారణం లేకపోలేదు. ఆతను ఒక ఉద్యోగం అంటూ చేస్తున్నాడు. కష్టకాలంలో పాతికో పరకో ఇచ్చి సహాయం చేస్తుంటాడు వీళ్ళకి

రోజూలాగే. ముగ్గురూ కలిపి వెళ్ళి భోజనాలు ముగించుకుని వచ్చి కాఫ్పేపు గప్పాలు కొట్టి నిద్ర కుపక్రమించారు.

రోజూలాగే విశ్వనాథం మాత్రం గుండెల మీద చెయ్యేసుకుని విశ్రాంతిగా నిద్రపోయాడు ఇక సూరిబాబూ, గోపాలాల అవస్థే చూడాలి! ఎంతోసేపు ఎదిరింటి సుందరిని గురించి ఆలోచిస్తూ పరుపుమీద దొర్లి నిద్రపోయారు.

ఆ నిద్రలో గోపాలానికి ఓ కల వచ్చింది-ఎదిరింటి అమ్మాయి తనకి లవ్ లెటరాసినట్లు తను తబ్బిబ్బు పడుతూ చదువుతున్నాడు.

''మైడియరెస్ట్ గోపాల్,

నిన్ను చూసినప్పట్నించీ నా మనసు మనసులో లేదు. నా ఆలోచనలన్నీ నీ చుటే తిరుగుతున్నయ్ నీ దగ్గిరికి పరిగెత్తి వద్దామా అనిపిస్తోంది.

"ప్రియతమా! మనిద్దరికీ ఎన్నో జన్మల అనుబంధం ఉన్నట్లు కనిపిస్తోంది నాకు. ఇన్నాళ్ళూ నీ కోసమే ఎదురు చూస్తున్నానేమో నేను!" 'లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అంటే ఇదే కాబోలు. నువ్వు కూడా నన్ను ప్రేమిస్తోన్నావని నీముఖమే చెబుతోంది

"నువ్వంటే నాకు ప్రాణం! నువ్వు లేందే నేను బ్రతకలేను........'' ఇల్లాగే ఏమేమో రాసింది గోపాలం మనసు సంతోషంతో గెంతులేస్తోంది.

ఇక సూరిబాబు కొచ్చిన కల ఇంకా బ్రహ్మాండంగా ఉంది. కలలో—అది ఇంద్రసభలా ఉంది—అందులో సింహాసనం మీద ఇంద్రుడు కాబోలు కూచుని ఉన్నాడు. ఆశ్చర్యం ఏంవిటంటే ఆ ఇంద్రుడు సూరిబాబే! అతనికి ఎదురుగుండా ఓ అప్సరస నృత్యం చేస్తోంది. ఆమె శరీరంలోని వంపులన్నీ ఆ నృత్యంలో సూరిబాబుకి పసందుగా,కనుల

విందుగా కనిపిస్తోన్నాయ్. నాట్యం అయి పోగానే, పరిగెత్తిపెళ్ళి, ఆ అప్సరసని గట్టిగా కావిలించుకున్నాడు సూరిబాబు తీరా చూస్తే ఆ అప్సరస ఎవరో కాదు- ఎదిరింటి అభిసారికే!

ఇలా రాత్రంతా కలలతో వేగి పోయి తెల్లవారి ఆలస్యంగా లేచారు గోపాలం సూరిబాబులు. ఆవేళ సుప్రభాతం డ్యూటీ విశ్వనాథానికి పడింది.

ఆ రోజు ఉదయంనించీ సాయంత్రం అయిదు గంటలదాకా దాదాపు ముందు రోజు కథే రిపీట్ అయిందని చెప్పొచ్చు. సాయంత్రం విశ్వనాథానికి కాస్త పని ఎక్కువగా ఉండటంవల్ల కృష్ణమూర్తితో కలిసిరావటం పడలేదు. ఐదున్నర దాటి పొస్తున్నప్పుడు, తీరికగా నడుస్తూ సందు చివరికి వచ్చాడు. అంతలో ఎదురుగుండా కనిపిస్తోన్న దృశ్యాన్ని చూసి, కాస్తంత ఆశ్చర్యపోతూ విశ్వనాథం.

ఎదిరింటి అమ్మాయి. వరండాలో నించుని ఉన్నది ఓసారి వాళ్ళింట్లోకి. మరోసారి కృష్ణమూర్తి ఇంట్లోకి చూసి, గబగబా వీధివాటివచ్చి, తమ ఇంటి వరండాలో నించుని ఉన్న కృష్ణమూర్తి చేతిలో ఓ కాగితంపెట్టి. ముసిముసిగా నవ్వుతూ వచ్చినదార్నే వెళ్ళిపోయింది.' అయితే వ్యవహారం ఇంతదాకా వొచ్చిందన్న మాట అయినా పెళ్ళయిన వాడిని పట్టుకుని ఊగులాడుతోందేవిటీ పిల్ల! నిజంగా వెర్రిదిలా ఉంది. పోనీ ఈ కృష్ణమూర్తిగాడికైనా బుద్ధి ఉండొద్దూ! నాకేగనక అధికారం ఉంటే చెప్పుచ్చుకు కొట్టి ఉండేవాణ్ణి." అనుకుని గబగబా మేడ మీదికెళ్ళిపోయాడు విశ్వనాథం.

అక్కడ గదిలో రామ రావణ యుద్ధం జరుగుతోంది. గోపాలం గొంతు ఖంగు మంటోంది- 'ఛీ! నీవింత మిత్ర ద్రోహి వనుకోలేదురా సూరిబాబూ! ఉద్యోగం సద్యోగం లేకుండా గొంతుక్కూర్చుని నువ్ చేస్తున్న పని ఇదట్రా దర్టీరోగ్! ఏ ఆడపిల్లయినా నీ దేభ్యపు ముఖాన్నెలా ప్రేమిస్తుందనుకున్నావ్? ఆడపిల్ల నావైపు ఎంత ప్రేమగా చూసిందో తెలుసా విన్న

ఆమెని నేను వాప్రాణానికి ప్రాణంగా ప్రేమిస్తున్నా, ఆమెవైపలా దొంగచూపులు చూడటానికి సిగ్గెన్ని దమ్ములుండాలి? హుఁ....." అంతలో సూరిబాబు గొంతుక ఇంకా గట్టిగా విన్పించింది-' అనవసరంగా నోరు పారేసుకోకురా గోపాలం! కోపమొస్తే నేను మనిషినికాను తెలుసా? ఆ పిల్ల విన్నట్టుంచీ నావైపు చూస్తోంచే నేనూ చూస్తోన్నాను అదిదేదో నీస్వంత ప్రాపర్టీ అయినట్టు మాట్లాడతావేం? మవ్వేమో మహా అందగాడి వయినట్టు వమ్న పేరు పెడతావట్రా రాస్కెల్!...." కోపం ఎక్కువగా వొచ్చినప్పుడు సూరిబాబుకిక మాటలు పెగలవు. అలాంటప్పుడు అతనిచేతులు ఎదుటి వ్యక్తిని కొట్టటానికి లేవటం కూడా కద్దు.

గొడవంతా విన్నాడు విశ్వనాధం. లోపలికెళ్ళి ఇద్దరి చెవులు పిండితేగాని లాభంలేదు-కథ క్లైమాక్సు కెక్కేలా ఉంది అనుకున్నాడు. వెంటనే గాలి దుమారంలా లోపలికెళ్ళి "నోరు మూసుకోండ్రా దద్దమ్మల్లారా! ఎప్పుడు ఏ అమ్మాయి మనవైపు చూసిందా, ఏపిల్లకి ఎలా లోజాలు కొడదామా అన్న యావ తప్ప వేరే ఇంకోటిలేదు మీకిద్దరికీ. మీరిద్దరూ ఇక తన్నుకు చావండి, ఆపిల్లక్కడ ఆ వెళ్ళమనే క్రిష్ణమూర్తిగాడిని పట్టుకు వేళ్ళాడుతోంది. విన్నదంతా వింటూ, ఆపిల్ల కిటికీ దగ్గర వరండాలోంచి చూస్తోన్నది మీ ఇద్దర్లో ఎవర్నీకాదు తెలిసిందా!' అంటూ తాను చూసిందంతా చెప్పేశాడు.

అంతా అయ్యాక కొద్దిసేపు ఆ గదిలో నిశ్శబ్దం తాండవించింది. వాతావరణాన్ని ఎలాగో తేలికచెయ్యాలని సంకల్పించుకున్న వాడైన విశ్వనాధం. 'దేవలోక్' లో మంచి హిందీ పిక్చరొచ్చింది. వెళదాం లేవండి. ఎందుకలా దేభ్యం ముఖాలేసుక్కూర్చుంటారు' అన్నాడు. సినిమా ప్రియులైన సూరిబాబూ. గోపాలం జరిగిన గొడవంతా చిటికెలో మరచిపోయి భుజాలెగరేసుకుంటూ బయలుదేరారు విశ్వనాధం వెంబడి.

వాళ్ళయుద్ధం అంతా ముగించుకుని వెళ్ళేసరికి అక్కడ పిక్చర్ మొదలయేపోయింది. టిక్కెట్లు తీసుకుని చీకట్లో తడుముకుంటూ వెళ్ళి కూలబడ్డారోచోట. వాళ్ళకి ముందుసీట్లో ఎవరో ఓ జంట కూర్చుని ఉన్నారు. స్నేహితులిద్దరిమధ్య కూర్చునివున్న విశ్వనాధానికి ముందున్న వాళ్ళిద్దరూ అపలొచ్చింది. సినిమా చూడటానికో కబుర్లాడుకోటానికో అర్థంకాలేదు ఆ అబ్బాయి ఓసారి ఆ అమ్మాయి భుజం చుట్టూ చెయ్యేసి మాట్లాడితే, ఆ అమ్మాయేమో మరోసారి పూర్తిగా అతని మీద పడిపోతూ గుసగుస లాడుతోంది. ఇంతకీ ఇంటర్వెల్ రోమాస్తే ముందున్న వాళ్ళు కృష్ణమూర్తీ. ఎదిరింటి అమ్మాయీను. ముగ్గురు మిత్రులూ నోర్లు తెర




చకొని వుండిపోయారు కాసేపు. ఉన్నట్లుండి వెనక్కు తిరిగి చూసిన కృష్ణమూర్తి 'హలో! విశ్వనాధంగారా! ఈవెనింగ్ ఆలస్యంగా వచ్చారుకదూ! అన్నట్టు చూడు సంధ్యా! ఈయన నా కొలీగ్ విశ్వనాథంగారు. వాళ్ళిద్దరూ ఆయన స్నేహితులు. ముగ్గురూ మనింట్లో మేడ మీద గదుల్లోకి మొన్ననే వచ్చారు. ఈవిడ నా భార్య మిసెస్ సంధ్యారాణి' అన్నాడు.

మనవాళ్ళు ముగ్గురికీ అతని మాటలేవీ అర్థంకాలేదు. వాళ్ళ ముఖాల్లోని ఆశ్చర్యం పసిగట్టారు కృష్ణమూర్తి 'ఓహో ఆదా! మనకెదురుగావున్న ఇల్లే మా మామగారిల్లు ఆషాఢమాసంకదూ! ఈవిడగారు పుట్టింటికెళ్ళారు. నేను వాళ్ళ ఇంటికెళ్ళగూడదట! తను మా ఇంటికి రాకూడదట. ఈ పెద్దవాళ్ళు శాస్త్రాలతో మన ప్రాణాలు తోడేస్తారండీ! ఇద్దరం కిటికీల్లోంచి చూసుకోలేకా, ఇలా సినిమాలలో, పార్కుల్లో కలుసుకోలేక ఛస్తున్నామంటే నమ్మండి' అన్నాడు. తన భర్త వాగ్ధాటికి మురిసిపోతూ, ఆ ఎదిరింటి అమ్మాయి- అంటే అతని భార్య పక్కుమని నవ్వింది.




(గత సంచిక తరువాయి)

"పిల్లి కొంపముంచేసిందా? బయట వుండేఁవిటి? అనేసి ఒక మారు శ్యామలరావువైపు చూశాడు.

"అహఁహఁ! అదేం కాదు...." ఎలా చెప్పాలి? ఏదో వుందని తెలిసిపోయింది గదా? చెప్పేస్తేసరి. గానీ రాజశేఖరం యింకా రాలేదు. సీతాపతి కంగారు పడుతుండగా కాంతమ్మ ట్రేలో ఫలహారాలు పట్టుకొచ్చింది. ఆమె మొహమ్మీద కూడా అంటించుకున్న నవ్వే!

"ఐతే మరేఁవిటి? టిఫిన్ల కోసవేనా? తలేవారేనండి! మా చెల్లెల్ని లోపల నానా హైరానా పెట్టేస్తున్నారన్నమాట!" అని కాంతమ్మ వైపు చిరునవ్వుతో తిరిగి,

"ఏమమ్మా? నీ పేరేఁవిటో చెప్పావు కాదు పిలకంతం" అని అర్ధోక్తిలో ఆగాడు.

"లక్ష్మీకాంతం అన్నగారూ!" వినయంగా జవాబు చెప్పింది కాంతమ్మ.

"ఆఁ! అదీ! ఏఁవిటి మాకు ఫలహారాలు పట్టుకునేగానీ మరోవిధంగా పలకరించగూడదని పట్టుబట్టావేఁవిటమ్మా?" అన్నాడు రంగారావు.

"అదేంగాదు అన్నగారూ! ఆలస్యమైపోయింది. క్షమించండి"

---

సీరియల్

"ఏం పరవాలేదులే. చూడమ్మా. ఇది నా చెల్లెలు శరవతమ్మ. అదిగో వాడు శ్యామలరావు. నా కొడుకు. నువ్వు చేసుకుంటే అల్లుడుకూడాను. వాడికి ముందు టిఫిను ప్లేటు పెట్టు. లేకపోతే అలుగుతాడు."

అందరూ ఆనందంగా నవ్వారు.

కానీ ఈ ఆనందం నిజం చేసుకొనే అదృష్టం తమకుందా?

శ్యామలరావుని చూసింది కాంతమ్మ. చక్కగా ఉన్నాడు. సరోజనికి చక్కని జోడుకూడా. కానీ తమ అదృష్టం ఇలా తగలడింది.

అందరికీ ఫలహారాలిచ్చింది. తింటూ రంగారావే, ఏదేదో మాటాడుతున్నాడు. తనకి వేట సరదా అనీ, ఈమారు సీతాపతివాళ్ళు తమ యింటికి వచ్చినప్పుడు తాను కొట్టిన దుప్పికొమ్ములు యిస్తాననీ. అవి యెదురుగావున్న ద్వారాలకి రెండు వైపులా పెడితే చాలా అందంగా వుంటుందనీ. బావగారు తహశీల్దారుగిరీ నుండి రిటైరు కాగానే కాంతమ్మనీ, బిడ్డనీ తన ఇంటికి తీసుకుపోయి- సీతాపతికి మాత్రం పెద్దపులిచర్మం ప్రెజెంటు చేస్తాననీ, ఆ కృష్ణాజినాన్ని చంకలో పెట్టి అతగాడ్ని సన్యాసుల్లో కలిపేస్తాననీ- ఇలా చాలా చొరవగా మాటలాడుతున్న రంగారావును చూస్తే, శ్యామలరావుకే విచిత్రం వేసింది. సమాజంలో ఇంత

## జరిగిన కథ

శ్యామలరావు కృష్ణమోహన్ స్నేహితుడు. లా స్టూడెంట్లు. శ్యామలరావు ఆశయం గొప్పది. కారణం తన తల్లి మూగది. ఆమె అనేక బాధలకు లోనై చనిపోయింది. మానసికంగా బాధపడే అమ్మాయినే పెళ్ళి చేసుకోవాలనే తన నిర్ణయాన్ని తెలుపుతాడు స్నేహితుడు. మోహన్ సెలవులకు వెళ్ళిపోతున్న రోజున మోహన్ తల్లి కామాక్షమ్మ కొడుకు విషయంలో అమిత ప్రేమ చూపుతుంది. కానీ మోహన్ సరోజ వివాహ విషయంలో మాత్రం విముఖత కనబరిచింది. కారణం సరోజకు ఫిట్స్ జబ్బు. శ్యామలరావు స్నానానికి వెళ్ళినప్పుడు చౌదరాణి విచిత్రంగా కలిసింది. స్నేహితుడు సాహూ శ్యామలరావు రాకను చూసి ఆనందపడిపోయాడు. చౌధరాణి భర్త తిరిగి వచ్చాడు. సరోజనికి వేరే పెళ్ళి సంబంధము గురించి సన్నాహాలు జరుగుతున్నాయి. శ్యామలరావు చౌధరాణి భర్తను చూచివచ్చేందుకు సాహూ ఇంటికి వెళ్ళాడు.

ఆమె పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది. భర్త సాధింపులు ఎక్కువయ్యాయి. చౌధరాణి ఆత్మహత్య చేసుకునేందుకు సిద్ధమయింది శ్యామలరావు ఆమెను ఆ ప్రయత్నంనుంచి విరమింపజేశాడు. పెళ్ళిచూపులకు శ్యామలరావు సరోజనిని చూచేందుకు వచ్చిన సందర్భంలో ఫిట్సు వచ్చి పడిపోతుంది.)

సజీవంగా తనతండ్రి వుంటాడని, ఇంత వరకూ తనకి తెలియనందుకు ఆశ్చర్య పోయాడు

సీతాపతి నవ్వుతున్నాడేగాని. మన స్సంతా కంగారుపడుతునే వుంది. ఒక మారు వెళ్ళి చూసిరావాలనిపించింది. గాని యింతలో రాజశేఖరం బయటికెళ్ళిన వాడు తిరిగొస్తూ కనిపించాడు.

"ఏంవిటి రాజశేఖరంగారూ- మనలో ఎవరు పెద్దో. ఎవరు చిన్నో తెలియదు గనక పేరుపెట్టి పిలుస్తాను మరి. ఆఁ, అయితే బయటికెళ్ళిన పని ఏం జేసుకొ చ్చారు? మా కోసం రాత్రికి పొజేలు సిద్ధం చేయించారా. లేకపోతే మేకపోతు నేయిస్తున్నారా?"

మరొకమారు అందరూ నవ్వారు.

కాసేపు గడిచిన తరవాత ఈ యమ యాతన భరించలేకపోయాడు సీతాపతి. డాక్టరు కొద్దిసేపట్లో వచ్చేస్తాడు. అప్పుడు పిల్ల అడగటం తాము చెప్పడం కంటే ముందు తాము చెప్పాలని సిద్ధపడ్డాడు.

"తమతో నేనొక మనవి చేసుకో వాలి...."

"మామూలు భాషలోనే మాట్లాడండి" మధ్యలోనే చెక్ వేశాడు రంగారావు. "మనవులూ, మనవరాళ్ళూ నా కొద్దు. మాటాడండి. చాలు— గాని మీ కంటే ముందు. నేనొక మ న వి చేసుకుంటు న్నాను మీతో— కట్నాలూ కానుకల విషయాలపై మాటాడకండి మీరు దయ చేసి। అవంటే నాకు అసహ్యం।"

అతని సహృదయతకి కరిగిపోయాడు శ్యామలరావు. ఎంత మంచి తండ్రికి కొడుకనన్న ధీమాతో ముందుకు వంగి కూచున్నాడు?

"ఆ విషయంకూడా కాదు...

"మరి?"

"మరేం లేదు...." రాజశేఖరం సాయంచేశాడు. "మీకు నీలకంఠం చెప్పలేదనుకుంటాను. చెప్పొద్దనికూడా అన్నాంలెండి. క్షమించండి. గా నీ ఇప్పుడు చెప్పక తప్పదు. అమ్మాయికి సంవత్సరంనుండీ హిస్టీరియా వుంది" చాలా శ్రమతో ఆ వాక్యం పూర్తిచేశాడు.

"హిస్టీరియానా?" దిగ్గున లేచి కూర్చు న్నాడు రంగారావు. మునుపటి ధోరణి మాయమైపోయింది. హటాత్తుగా గంభీ రంగా మారిపోయాడు. ఒక క్షణం మౌనంగా వుండి। తర్వాత ప్రశ్నించాడు. "ఎంతకాలం నుంచి వుంది."

"సంవత్సరం దాటింది. మందులిప్పి స్తున్నాం. పెళ్ళయితే నయం కావొచ్చు నని డాక్టర్లు చెపుతున్నారు" సీ తా ప తి ప్రతి అక్షరాన్ని ప్రాధేయ పూర్వకంగా ఉచ్చరిస్తూ నిజంగా మనవి చేశాడు.

"అరే. మాకు నీలకంఠం చెప్ప లేదే?... "



"అదే.... అదీ.... తమరూ...." కంగారుపడాడు నీలకంఠశాస్త్రి.

"మేమే చెప్పొద్దని అతన్ని బ్రతిమాలాం. హిస్టీరియా అనగానే ఎవరికయినా భయవేఁగదా? ఇదేం ప్రమాదకరంకాదు. ఆ మాట ఎవరూ వినిపించుకోరు. జీవితాంతం బాధపడవలసి వస్తుందేమోనని అనుమానంతో తిరస్కరిస్తారు.

గానీ తల్లిదండ్రులకు భారమైపోకూడదు ఆడపిల్ల, పెళ్ళయి, పిల్ల అత్తవారింట సుఖపడాలనే కోరిక. దాని అనారోగ్య కారణంగా, చంపుకోలేరుగదా ''

''మరేమైనా సంబంధాలు యింతకు ముందు చూశారా?'' రంగారావే అడిగాడు.

ఆ ప్రశ్నతో వాతావరణం ఒక క్షణం నిశ్శబ్దం ఆవరించుకొంది. ఏం చెప్పాలో ఎవరికీ తోచలేదు గానీ కాంతమ్మ ధైర్యంచేసింది ''ఒక సంబంధం అనుకున్నాం అన్నగారూ! గానీ పిల్లకి ఇలా అనారోగ్యమని తెలియగానే వాళ్లు తప్పుకున్నారు'' జవాబు చెప్పింది. రాజశేఖరం తలొంచుకున్నాడు.

''అరెరే! నీలకంఠం చేత ముందుగానే మాకు చెప్పించవలసింది ఈ రావడాలూ, పోవడాలూ మీకూ మాకూ శ్రమే కదా? హిస్టీరియా అంటే ఎలాంటి జబ్బో నాకు తెలుసు. రోగిని చంపేయదుగానీ బతక నివ్వదు కూడా. అదీ ఒక్క రోగి మాత్రం పడేబాధ కాదుగదా? హిస్టీరియా! పడేవాళ్ళ కంటే రోగికింద పాటు పడే వాళ్ళదే ఎక్కువ బాధ! అలాంటి పిల్లని మా వాడికిచ్చి చేస్తామని ఎలా అనుకున్నారు మీరు? క్షమించండి. ఈ మాట మీ ఎదురుగానే అనవలసింది. కాదేమో గానీ, మీకు మాత్రం తెలియదా! తెలిసి తెలిసి ఈ పని చెయ్యలేం! అబ్బాయి గొంతు కొయ్యడమే గదండీ యిది?''

అంతే!

అంతకంటే ఏ మంచివాడుగానీ మరేంవంటాడు?

మంచివాడు గనక శాంత మర్యాదగా తిరుతున్నాడు. అదే దురుసు పెళ్ళివాళ్ళయితే కస్సు బుస్సుమని గావు కేకలేసి వెళ్ళిపోతారు. గానీ ఎవరటగానీ తన పిల్లని చేసుకోవడం మాత్రం కల్ల!

సీతాపతికి కళ్ళ నీళ్ళ పర్యంతమైంది.

''ఐతే ఆ అమ్మాయికి పెళ్ళే కాదా?''

శ్యామలరావు తండ్రి నడిగాడు. పసుడు అలా కలగజేసుకోవడం అక్కడున్న వాళ్ళందరితోపాటు రంగారావుకి కూడా విచిత్రమనిపించింది. వెంటనే జవాబు చెప్పలేక పోయాడు.

''నీకు తెలియదులే చెప్తాను'' అన్నాడు.

''చెప్పండి, ఆ అమ్మాయికి పెళ్ళి కాదా?''

''ఔతుంది. మరో సంబంధం చూసుకుంటే...'' నసిగాడు రంగారావు. శ్యామలరావు సీతాపతి వైపు చూశాడు. క్షమించండి. నేను మీ అమ్మాయిని చూడొచ్చా?'' చాలా వినయంగా అడిగాడు. ఎందుకు అని విస్తుపోతున్నాడు రంగారావు శ్యామలరావు ప్రవర్తన అర్థం కావడం లేదు.

సీతాపతికి ఏం జవాబు చెప్పాలో తోచలేదు.




ఇంతవరకూ వచ్చింది గనక నీలకంఠం వున్న సంగతి కాస్త చెప్పేశాడు. "మీరు రావడానికి క్షణం ముందే అమ్మాయి ఫిట్ వచ్చి పడిపోయింది. ఇంకా తేరుకో లేదు."

"డాక్టరుకి కబురు పెట్టాం." చెప్పాడు రాజశేఖరం.

ఇంక ఒక్క క్షణం ఆ యింట్లో ఉండ కూడదనిపించింది రంగారావుకి. ఎంత దగా! జబ్బు పిల్లని గదిలో పెట్టుకుని, తమతో పెళ్ళి కబుర్లు ఆడేస్తున్నారా? మోసం చేసి పెళ్ళి చేసి తన కొడుకు గొంతు కొయ్యాలని చూశారు.

మాటల్లో డాక్టరొచ్చారు. రాజశేఖరం లేచి డాక్టర్ని ఇంట్లోకి తీసుకొని వెళ్లాడు.

"మరిమేం కూడా వెళ్తాం." నిల్చున్నాడు రంగారావు.

"కూర్చోండి. వెళ్దాం." అంటూ తాను లేచి నిల్చున్నాడు శ్యామలరావు. "నేను మీ అమ్మాయి నొకసారి చూస్తాను." అన్నాడు సీతాపతి.

"ఇప్పుడా?" సీతాపతి ఆశ్చర్యపోయాడు.

"అవును, ఇప్పుడే, ఈ పరిస్థితిలోనే చూస్తాను. దయచేసి మరోలా అనుకోకండి. జబ్బు పిల్లని చూడాలని ఏదో తమాషా కోసం నేను అనడం లేదు. చాలా సిన్సియర్‌గా అడుగుతున్నాను. చూపిస్తారా?" అడిగాను.

రంగారావు వైపు చూస్తూ సీతాపతి నిల్చున్నాడు.

రంగారావు కేమీ అర్థం కావడం లేదు.

సీతాపతి వెంట శ్యామలరావు లోపలి కెళ్ళాడు. ఒక్కడే పట్టబడి పోవడానికి జడిసి నీలకంఠశాస్త్రి కూడా వాళ్ళ వెంట జారుకున్నాడు. తిరపతమ్మ, రంగారావు మిగిలిపోయారు.

"ఏంవిటిది? ఎందుకు చూస్తానంటు న్నాడు శ్యామల్రావ్?"

"ఏమో, అతగాడి తిక్కకి అర్థాలు నన్నడ గొద్దు. అయినా నీకు మరీ తిక్క హిస్టీరియా కేంవిటి, పింగినాదం. మా అత్తగారింట్లో నైతే ప్రతిఅరదానికి హిస్టీరియానే శుభ్రంగా ఆ మూడు ముళ్ళూ పడేయించక...."

"నోర్ముయ్!" మధ్యలోనే అరిచాడు రంగారావు.

కొడుకు బ్రతుతుకు కంటే తిరపతమ్మ మాట ఎక్కువ కాదు తనకి. తనుచచ్చినా వొప్పుకోడు ఈ పెళ్ళికి.

అన్న మొహం లోకి చూడగానే భయం వేసింది తిరపతమ్మకి. అతనికి కోపం రానే రాదు. ఒస్తే మాత్రం ప్రళయ రుద్రుడు. వాళ్ళకి కూడా మరేం తోచక లోపలి కెళ్ళారు. భీకానకంగా వుంది రోగి పరిస్థితి. వెనక్కి విరుచుకు పడిపోతూ, చొంగలు కక్కుతోంది. "ఏం భయంలేదు పరవాలేదు. ఒక్క ఇంజక్షన్‌తో సర్దుకుంటుంది." అంటున్నాడు డాక్టరు.

సర్దుకునే దాకా చాలా భీభత్సమై పోయింది.

చూస్తూ నిల్చున్నాడు శ్యామల్రావు.

ఇంత అందమైన అమ్మాయికి, అంత వికారమైన రోగమా? అన్యాయం!! అలా చూస్తుండగా డాక్టరు చెప్పినట్టు పదినిమిషాల్లో సర్దుకుంది. ప్రశాంతంగా సరోజని నిద్రపోతోంది.

అంతేనన్న మాట, పది నిమిషాల్లో ఒక ఇంజక్షన్‌తో సర్దుకునే జబ్బు ఖరీదు ఒక జీవిత కాలం అవివాహితగా గడపడమా? దారుణం!

బయట కొస్తుండగా గుమ్మం దగ్గిర సీతాపతితో చెప్పాడు నెమ్మదిగా. "నేను మీ అమ్మాయిని చేసుకుంటాను. తప్పక చేసుకుంటాను దిగులు పడకండి."

(సశేషం)

---

టీచర్ : నిన్న ఇంటి దగ్గర వ్రాసుకొని రమ్మన్న కాంపోజిషన్ అందరూ వ్రాసుకొని వచ్చారా? వ్రాయని వాళ్ళందరూ నిలబడండి.

(గోపి సగం కూర్చున్నట్లుగా, సగం నిలబడ్డట్లుగా ఉండును)

టీచర్ : అదేమిటిరా గోపీ అలా నిలబడ్డావేం? ఇంతకి నువ్వు వ్రాసినట్లా వ్రాయనట్లా?

గోపి : నేను సగమే వ్రాసానండి నిలబడాలో, కూర్చోవాలో అర్థం కాలేదండి.

—ఎమ్. ఎన్. వరమూర్తి, అనకాపుత్తూర్.




అనగనగా ఒక ఆఫీసు

"దేశంలో వున్న అన్ని ఆఫీసులు చేస్తున్న పన్లొకటే, మా ఆఫీసు పేరు తెలుసుకొని ఏం చేస్తావులేవోయ్!" అంటారు ఆ ఆఫీసులో పన్జేసే కుఱ్ఱ గుమస్తాలు. ఎవరైనా వాళ్ళ ఆఫీసు పేరు అడిగితే.

''మా ఆఫీసు బహు చక్కనిది. వెరీ సిన్సియర్ ఇన్ ఎవరిథింగ్'' అంటారు ఆఫీసరు.

''వెధవది మా ఆఫీసులో పనిచేసే వాళ్ళెవరూ లేరు. అందరూ బద్ధకస్థులే! నే లేకపోతే, నామాట భయం లేకపోతే, మా ఆఫీసులో ఒక్కవెధవ పన్జేసేవాడు కాదు. నేనుండటంవల్ల యీ ఆఫీసు ఒకదారో నడుస్తూంది! నేనుగానీ లేకపో

లేనా!!" ఆఫీసు సూపరిన్ టెన్ డెంటుగారి కామెంటు.

మా ఆఫీసులో పనిచేసే కుర్రాళ్ళు ఉత్త కబుర్లరాయుళ్ళు! పని చేతకాదు! నేర్చుకోవాలన్న ఆసక్తి లేదు! అన్ని పన్లు మా వల్లె జరగిపోతున్నాయి!!" సీనియర్ క్లార్కుల గోల.

"అందరు బాబులు మంచోళ్లు! మా రాజులు!" అఫీసు జవాను కాంప్లిమెంటు.

ఇంత చరిత్ర వున్న ఆ ఒకానొక ఆఫీసు అందరికీ దూరంగా ఊరికి ఓ మూల పడివుంది. ఆ మూలకి వెళ్ళా లంటే రెండు బస్సులు మారాలి.

రెండు బస్సులు మారి చేరతారు సీని యర్ క్లార్కులు.

ఐదు మైళ్లు సైకిల్ మీద "చల్ మో హనరంగా" పాట పాడుతూ లోపల "ఈ బ్రతుకింతే" పాట పాడుకుంటూ ఆఫీసుకు చేరతారు కుర్రగుమాస్తాలు.

మొదటివారంలో బస్సుల్లో, మిగతా రోజులలో కాలినడకన చేరుకుంటాడు జవాను. వీళ్ళందరూ చేరిన ఐదు నిమి షాలకి సూపరిన్ టెన్ డెంటు స్కూటరు మీద హాజరు.

మరో పదినిమిషాలకి కార్లో ఆఫీసరు ప్రవేశం. ఒకానొకరోజు ఆ ఒకానొక ఆఫీసులో —

గడియారం పదిన్నర అయిందంటూ వుండగా, గుమాస్తాలు పలుగురూ సీట్లలో కూర్చుని ప్రయాణ బడలిక తీర్చు కుం టున్నారు.

జవాను పనిచేస్తున్నట్టే పనిచేయటం లేదు. కుర్రగుమాస్తాలు సినిమా కబుర్లు. సీనియర్ గుమాస్తాలు ఇంటి కబుర్లు మొద లయ్యాయ్. ఒక రెండు నిమిషాల్లో మరో రెండు నిమిషాల్లో అంటే సూప రిన్ టెండెంట్ గారి రాకతో అవి ఆగి పోయాయ్.

ఆఫీసరుగారి రాకతో ఆఫీసంతా పూర్తి నిశ్శబ్దాన్ని వింపుకొంది.

ఆఫీసరుగారు వొచ్చిన ఐయిదు నిమిషాల్లో సూపరిన్ టెంటుగారికి. పిలుపొచ్చింది. అంత త్వరగా పిలుపు ఎందుకు వచ్చిందో అర్థం కాలేదెవరికీ

ఎవరి వూహ కందినట్టు వాళ్ళు వూహించుకోవడం మొదలెట్టారు.

ఆలోచిస్తూనే లోపలికి వెళ్ళాడు సూప రిన్ టెన్ డెంట్. లోపలికి వచ్చిన సూపరిన్ టెన్ డెంట్ ఆఫీసరుగారి మొహంలోకి డైరక్టుగా చూడలేకపోయాడు ఆ ప్రయ త్నంలో ఆఫీసరుగారి మొహంలో రంగులు మహా భయంకరంగా వున్నట్టూ. ఆయన గారి చూపులు, ఈయనగార్ని కాల్చేసే టంత దారుణంగా వున్నట్టూ గ్రహించాడు సూపరిన్ టెన్ డెంటు.

ఆఫీసరుగారు మాట్లాడటానికి ప్రయ

త్నిస్తూవున్నారు. కానీ ఆయన్లోని కోపం, మాటని బయటకి రానీయడంలేదు.

"సార్" సూపరిన్ టెన్ డెంటే కలుగ జేసుకుంటున్నాడు. ఆఫీసరుగారికి కోపం ఎక్కువవుతోంది. చూపుల్లో, వొంట్లో సర్వం కోపమయమే!

"సార్!!" విషయం తెలియని సూపరిన్ టెన్ డెంటు మళ్ళీ అన్నాడు కంగారుగా, భయం భయంగా వినయాతి వినయంగా అన్నాడు.

ఆఫీసరుగారు కాస్త తమాయించుకొని "చూడండి" అన్నారు.

సూపరిన్ టెన్ డెంటుకి విషయం కొంచెం కొంచెంగా అర్ధమవుతూన్నటనిపించింది.

"చూడండీ! రేపు డెలివర్ చేయ్యాల్సినఫైలు కనబట్టంలేదు."

విషయం అర్ధమయింది సూపరిన్ టెన్ డెంటుకి ఆ తర్వాత ఆఫీసరుగారు "ఢాం" అని ప్రేలుతారని. ఆ ప్రేలుడికి తన మొహం పగులు తుందని కూడా తెలుసు. తెలిసినా తెలియనట్టుగానే నిలబడ్డవాడు నిలబడ్డట్టే వుండిపోయాడు.

"ఇది ఎలా జరిగింది ఎందుకు జరిగింది?" ఆఫీసరుగారి కంఠస్థాయి. ఇంతై అంతై అంతంతాయె! ఆ కంఠ స్థాయి సూపరిన్ టెన్ డెంటుని "ఎ" క్లాసు జైల్లో పడేసింది.

"ఆ ఫైలు దొరక్కపోతే ఏమవు




తుందో తెలుసా?" తెలుసు సూపరిన్ టెండెంటుకి. కానీ తెలుసుకున్నట్టు పెదాలు కదుపలేదు తల ఆడించలేదు.

"మాట్లాడరేం?...."

మాట్లాడితే ఆ కోపస్థాయి యింకాస్త మసాలాని కలుపుకుంటుందని తెలుసు.

"అదిగానీ దొరక్కపోతే, వి ఆల్ విల్ గోటుడాగ్స్" ఆ సంగతి తెలుసు సూపరిన్ డెంటుకి "వెళ్ళండి వెతికించండి! లేకపోతే....లేకపోతే" ఆయన మరో పది మాటల్ని వెతుక్కోకముందే- సూపరిన్ టెన్ డెంటు అతి వినయంగా తలూపి బయటకు దారి తీసాడు.

అతి జాగ్రత్తగా బయటకొచ్చిన

ఆయన అతి జాగ్రత్తగా హెడ్‌గుమాస్తా వైపుకి దూసుకుపోయాడు. హెడ్డు మంచి బాలుడిలా లేచి నిలబడ్డాడు.

హెడ్డు సూపరిన్‌టెన్‌డెంటుగారి మొహం పరిశీలించాడు. మొహంలో కోపం ఎంత మోతాదులో వుందో తెలుసుకోడానికి ఎంతోసేపు పట్టలేదు హెడ్డుకి.

హెడ్డు మరీ మంచి బాలుడై పోయాడు.

"రేపు డెలివర్ చేయాల్సిన ఫైలు కన పట్టంలేదు" "అరెరే!!"

"అరెరే ఏమిటయ్యా అరెరే!!"

అరెరే అంటే ఏమిటో చెబుదామను కున్నాడు హెడ్డు చెబితే-

సూపరిన్‌డెంటుకి చాలా గుర్తుకొస్తాయ్.

తను ఆ మధ్య ఆయన్ని సినిమాకి తీసుకెళతానని తీసుకెళ్ళలేదు; మొన్నామధ్య వాళ్ళ పెద్దమ్మాయ్ కారు నలుపు పెళ్ళవటం కష్టమని నోరు జారాడు; వాళ్ళావిడ లావని తనతోటి గుమాస్తాతో అంటే అదికాస్త ఆయన చెవిలో వూదాడా గుమాస్తా. ఇలా ఎన్నో

అమ్మో ఇవన్నీ గుర్తుకొచ్చేయవూ!

"ఏమయ్యా. నీ కింద వున్నవాళ్ళంటే కుట్టాళ్ళు, నువ్వయినా జాగ్రత్త పడొద్దూ! ఛి ఛీ"

కుట్టాళ్ళయితే జాగ్రత్త వుండకూడదా! హెడ్డు కర్థంకాలేదు.

"ఆ ఫైలుపోతే ఏమవుతుందో తెలుసా! " అంటూ సీట్లో కెళ్ళిపోయాడు సూపరిన్‌టెన్‌డెంటు.

ఏమవుతుందో ఆలోచించు కొనేటప్పటికి హెడ్డుకంతా అయోమయంగా వుంది.

తనూ, తనపెళ్ళాం బిడ్డలూ. అమ్మో తన వాళ్ళంతా అన్యాయం అయిపోరూ!

తనకీ. తన పెళ్ళాం బిడ్డలకీ జరగబోయే అన్యాయం గుర్తొచ్చేటప్పటికి. ఈ ప్రపంచం మీద కోపం పుట్టుకొచ్చింది హెడ్డుకి రేపు రాబోయే చీకాకులు ఎల్లుండి మిగలబోయే చీకటి హెడ్డుకి గుర్తొచ్చి ప్రాణం లేకుండా చేసాయి అతగాడ్ని. వాళ్ళంతా కోపాన్ని వింపుకొని తన కంటే ఓ రెండు సంవత్సరాలు సర్వీసులో తక్కువగావున్న గుమాస్తా దగ్గరకి వెళ్ళాడు

"ఫైలు పోయింది"

"రేపు డెలివర్ చేయాల్సిందేగా!"

"అయితే విషయం తెలుసు నన్నమాట!"

"విన్నాను"

హెడ్డుకి సీనియర్ గుమాస్తా ధోరణి నచ్చలేదు.

"విషయం తెలిసినా పట్టనట్టు కూర్చున్నారే!" అన్నాడు పట్టినట్టు నిలుచుంటే లాభం ఏమిటి! అడగాలను కున్నాడు సీనియర్ గుమాస్తా. కానీ అడగలేదు. అతన్ని అలా ఎదురు

ప్రశ్నలేస్తే వూరుకోడని. తను మొన్న కాఫీ పోయించలేదన్న కోపం. ఆ మధ్య సూపరిన్‌టెండెంట్ చెవిలో వేసిన విషయం విన్న సినిమా చూపించలేదన్న విషయం-ఇత్యాదులన్నీ గుర్తొచ్చి పేట్రేగి పోతాడని-ఏం మాట్లాడకుండా కూర్చున్నాడు.

"చూడండీ! ఫైలు దొరక్కపోతే మనపని గోవిందా-మన పిల్లలపని గోవిందా! అంతా గోవిందమయ మవుతుంది. వెళ్ళండి వెతికించండి-వూఁ"

అంటూ అక్కడనుండి తన సీట్లోకి ఒక్క అడుగులో వెళ్ళి కూర్చున్నాడు హెడ్డు.

సీనియర్ క్లార్కుకి కోపం వచ్చింది. బాధేసింది. అరెంటినీ కలుపుకొని కట్టి గుమాస్తాల దగ్గరకెళ్ళాడు.

"మీరెందుకు ఇక్కడికొచ్చారో మాకు తెలుసు" కోరస్‌లో పలికాయి కట్టి గుమాస్తాల గొంతుకలు.

"అహఁ! అలాగేం! ఏమిటి తెలుసూ" కాస్త గట్టిగా అన్నాడు. సీనియర్ గుమాస్తా.

"మీరు కాస్త మెల్లగా మాట్లాడే ప్రయత్నం చేయండి" ఇద్దర్లో ఒకడే అన్నాడు.

సీనియర్ వాళ్ళని కిందకీ పైకీ చూడటం తప్ప ఏమీ చేయలేదు.

"ఫైలు పోయింది యింతేగా!!"



''అంత పెద్ద విషయం మీకింత చిన్నదిగా కనబడుతోందా''

''పోతే పోయింది. దొరికితే ఇక్కడ పనిజేస్తాం. దొరక్కపోతే వేరొకచోట''

''ఊఁ వేరేచోట-ఎవడోయ్ మీకు వేరేచోట వుద్యోగమిచ్చేవాడు.

''నీ కిస్తారేం?''

''మారాజులా''

''పుచ్చిపోయిన నీ మొహానికివ్వగా లేంది మాకేం తక్కువ''

''ఎవరిదీ పుచ్చిపోయిన మొహం?''

''వేరే చెప్పాలా?''

''పనీపాట చేయలేని వాళ్ళకి మాటల డాబుసరి మా ఎక్కువ''

''నువ్వు పనిజేస్తున్నావా?''

''చేయటంలేదూ? నే చేఁ...''

''సరి సర్లే. నీ పెళ్లాందగ్గిర చెప్పుకోవోయ్ ఈ బోడిమాటలు''

''ఏమిటా మాటలు''

''వున్నమాటే.''

''మర్యాదగా మాట్లాడండి''

''నీకా? మర్యాదా!!!''

''తుస్'' ఇద్దరూ కోరస్‌లో నవ్వారు.

ఆ నవ్వు సీనియర్ కోపాన్ని రెట్టించింది. కోపం అసహ్యం మొహంలోకి తెచ్చుకుని-

''సరి సర్లే వెధవ నవ్వులూ, వెళ్ళండి వెతకండి ఫైలు'' అని అన్నాడు.

''నువ్వు వెతకవా?''

''ఎందుకు వెతకమూ?'.

''మరి వెతుకూ''

''ఏం ముందు మేం ఎందుకు వెతకాలి?'' నువ్వు ఎందుకు వెతకవ్?''

''నేను మీకంటే సీనియర్ని''

''సీనియర్ గినియర్ జాంతానయ్. రేపు ఫైలు దొరక్కపోతే, రేపు మనమంతా చెట్టు కింద మనుషుల మవుతామోయ్''

''వోయ్ ఏమిటోయ్ వోయ్''

''నువ్వు మమ్మల్ని అనొచ్చా?''

''నేను మీకంటే పెద్దాడ్ని''

''ఓయబ్బో!''

''సరి సర్లె వెక్కిరించారు. వెళ్ళండి. వెతకండి.''

''మీరు వెళ్ళండి వెతకండి''

''మీరు నాకు చెప్పేవాళ్ళయ్యారా?''

ఆ ముగ్గురి వాదనా ఆగడం లేదు. వాళ్ళ వాదన ఆపటానికి వచ్చిన జవాను మీదకి ముగ్గురూ విరుచుకుపడ్డారు.

''అసలు వీడే దీనికంతటికీ కారణం''

''ఈ వెధవ జాగ్రత్తగావుంటే ఇంత పని జరిగేదా''

''అరేభత్! తిని తూర్చోవడంతో సరిపోతుంది వీడికి.''

ఇలా సాగుతున్న వాళ్ళ ధోరణి సాగి సాగి ఫుల్‌స్టాప్ పెట్టుకుంది.

జవానుకి బాధేసింది. తనూ ఎలా—అర్థంకాలేదు. కోపం వచ్చింది వాళ్ళమీద ఏమీ అనలేక పోయాడు. కానీ వాడికి తెలుసు ఇంటికి వెళ్ళిన తరువాత, పెళ్ళాం బిడ్డల్ని ఈ నెపంతో తెగతిట్టేస్తాడని.

అనగనగా ఆఫీసు గొడవ గొడవగా వుంది.

అందరికీ రేపు తలపు కొచ్చి. రేపటి పరిస్థితి వూహకొచ్చి. తమని ఎవరో తుపాకితో నిలువునా కాల్చి చంపేస్తున్నట్టు బాధపడి పోతున్నారు. ఆఫీసరు గారికి మాటి మతిలో లేదు.

సూపరిన్‌టెండెంటుకి, ఎవరో గొంతు నులిమేస్తున్నట్టుగా వుంది.

హెడ్ క్లార్కుకి కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయ్. సీనియర్ కుర్రకారుని ఎదిరించిన ఎదిరింపులు ప్లస్ ఫైలు విషయం కలిసి వొంటిని కండలు కండలుగా కోస్తున్నాయ్.

కుర్రకారుకి రేపు కాఫీలు. సినిమాలు తమ జీవితం నించి వెళ్ళిపోతున్నాయ్. అవి తెగబాధగా వుంది. జవాను తనే చచ్చి పీనుగై పోయినట్టే. అయిపోతున్నాడు.

(కానీ. కానీ ఫైలు ఎవరూ వెతకడం లేదు) యిలా ఉండగా,

లోపల్నుంచి ఆఫీసరుగారి పిలుపొచ్చింది అందరూ లోపలి కెళ్ళారు.

'బాయిస్' బాస్‌గారికి ఆ క్షణంలో అందరూ "బాయిస్" లా కనబడ్డారు.

"యస్సార్!" అందరి కంఠాలు ఏక కంఠాలయినాయి.

"మనలో అంటే మీ అందర్లో అజాగ్రత్త పెరిగిపోతుంది" అందరి తలలూ కిందకి వేళ్ళాడాయి.

"లేకపోతే చూడండి ఫైలు ఈ బీరువా క్రిందేవుంది కానీ అది మనకంట పడలేదు. కనపడకుండా మనని ఏడిపించింది. మనని ఏడిపించిందీ అంటే మీ అజాగ్రత్తే దానికి కారణం."

అందరి మొహాల్లో హండ్రెడ్ క్యాండిల్స్ బల్బులు వెలిగాయ్. శతకోటి దీపపు కాంతుల్ని మొహంలోకి పుంజుకొని వెయ్యేనుగుల బలాన్ని వొంట్లోకి తెచ్చుకొని. ఆనందంగా తలలు పైకి లేపారు

"నిజంగా మనం అదృష్టవంతులం. బాయిస్! ఇకమీరు జాగ్రత్తగా వుండాలి"

"ఆఫీసరుగారి ఆర్డరు విన్నారా?" అన్నట్టు సూపరిన్‌టెండెంట్, హెడ్డు గుమాస్తా వైపు చూశాడు "జాగ్రత్తోయ్" అన్నట్టు సీనియర్ గుమాస్తాలవైపుకి చూడబోయి, చటుక్కున మొహం తిప్పేసుకున్నాడు.

"జాగ్రత్త! జాగ్రత్త!" అన్నట్టు గుమాస్తాలు జవాను వైపుకి చూసారు.

జవాను గోడ వైపుకి చూసాడు. శుభ్రంగావున్న ఆ గోడ ఆ క్షణంలో జవానుకి పగుళ్ళేసినట్టనిపించింది. పగుళ్ళేసిన ఆ గోడ కూలబడిపోతే బావుండుననిపించింది జవానుకి.




### అతి త్వరలో విడుదల కానున్న

### దీప్తి ఇంటర్ నేషనల్ వారి సాంఘిక చిత్ర రాజము

# "దేశోద్ధారకులు"

శ్రీ యు విశ్వేశ్వరరావుగారు చిత్రసీమకు చిరకాల పరిచితులు ఆయన నిర్మించిన ప్రతిచిత్రం దేశభక్తి సాంఘిక జీవన విలువలతో నిండి వుంటుంది అంతే గాక పటుతరమైన కథ, సంభాషణలు, సంగీత సమ్మేళనంతో ప్రేక్షకులకు ఆనందాహ్లాదాలతోబాటు మరువరాని సన్నివేశాలతో నిండి వుంటాయి వీరిచిత్రాలు. ప్రేక్షకులకు ఏదో ఒక ప్రబోధాన్ని అందించటమే శ్రీ యు విశ్వేశ్వరరావుగారి ఆశయం అనటంలో సందేహం లేదు

నేటి దేశకాల రీతుల దృష్ట్యా అతి ప్రయాసల కోర్చి నిర్మించిన సాంఘిక చిత్ర రాజము 'దేశోద్ధారకులు' ఈ చిత్రంలో ప్రతి సన్నివేశము ప్రేక్షకుల హృదయాలను హత్తుకొనే రీతిని చిత్రీకరించారు ప్రఖ్యాత చలన చిత్ర దర్శకులు శ్రీ పి యస్ రావుగారు.

పద్మశ్రీ ఎన్ టి రామారావు అత్యద్భుతంగా నటించి విడుదలకు సిద్ధంగా వున్న ఈ చిత్రంలో వాణిశ్రీ సావిత్రి శుభ నాగభూషణం, రాజనాల, ప్రభాకర రెడ్డి, అల్లు రామలింగయ్య, పద్మనాభం ముఖ్య భూమికలు ధరిస్తున్నారు

సంగీతం కె వి మహాదేవన్ కెమెరా, జి కె రాము కళ ఎస్ కృష్ణారావు దర్శకత్వం పి యస్, రావ్ బి ఏ (లిట్) నిర్మాత యు విశ్వేశ్వరరావు బి యస్ సి విడుదల విజయా



"దేశోద్ధారకులు" లో ఎన్. టి. ఆర్, శుభ.

---

## సావిత్రి ఆర్ట్స్ పిక్చర్స్ ప్రొడక్షన్ నెం. 1

అశేష ఆంధ్ర ప్రేక్షకుల ఆదరాభిమానాలు చూరగొని అపూర్వ కళాకారిణిగా, దర్శకురాలిగా, నిర్మాత్రిగా గొప్పప్రఖ్యాతి పొందిన కళాతపస్వి శ్రీమతి సావిత్రి శ్రీయుతులు వెంకటరత్నం పి సుబ్రహ్మణ్యం నిర్మాతలుగా స్థాపించిన సావిత్రీ ఆర్ట్ పిక్చర్స్ వారి ప్రథమ కానుక "ప్రొడక్షన్ నెం. 1"

ప్రముఖ టాక్సాపిస్ దర్శకుడు శ్రీ బి వి ప్రసాద్ దర్శకత్వంలో నిర్మించనున్న ఈ చిత్రానికి కథ శ్రీ టి. వి పాటు సమకూర్చారు. న్యాయం ఒక్కొక్కప్పుడు అన్యాయంగా ప్రవర్తించే అవకాశం వుంది న్యాయ స్థానాలకు గువ్ని కొన్ని సమయాల్లో అబద్ధమైన నిజాన్ని వినే చెవులేతప్ప, నిజాన్ని నిజంగా దర్శించే నేత్రదృష్టి కొరవడుతుందని అటువంటి సమయాల్లో కొంత మంది నిర్దోషులు ఆ అన్యాయానికి ఆహుతి అవక తప్పదని- ఏది ఏమైనా



"దేశోద్ధారకులు" లో రామారావు, వాణిశ్రీ, నాగభూషణం.

దోషులు తాత్కాలికంగా తప్పించుకున్నా, చట్టాన్నుంచీ శిక్షనుంచీ శాశ్వతంగా తప్పించుకోలేరనే గొప్ప నీతిని పునరుద్ఘాటించే చక్కని చిత్రం "ప్రొడక్షన్ నెం. 1"

"మంచి మనసులు" చిత్రం తరువాత శ్రీమతి సావిత్రి న్యాయవాది పాత్రలో చేయబోయే మేఘ ఘర్జనలు అన్యాయాన్ని కూకటివేళ్ళతో కదిలిస్తాయి. దోషుల హృదయాల్లో విప్లవం పిడుగులు సృష్టిస్తాయి. ఉదాత్తమైన ఈ పాత్రలో శ్రీమతి సావిత్రి తనకు తానే సాటి అని నిరూపించుకోనున్న ఈ చిత్రానికి జనవరి పదిహేనవ తేదీన విజయా గార్డెన్స్‌లో రెండు రికార్ చేయబడడంతో నాంది ప్రస్తావన జరిగింది. జనవరి ఇరువది ఐదవతేదీనుంచి సెట్స్‌మీదికి వెళ్ళిన ఈ చిత్రానికి ఒకేసారి తెలుగు-తమిళభాషల్లో కూడా చిత్రీకరిస్తున్నారు. ఏప్రిల్ నెలాఖరులోగా షూటింగ్ కార్యక్రమం పూర్తిచెయ్యాలని నిర్మాతల సంకల్పం. చాలాకాలం తరువాత హాస్యచక్రవర్తి పద్మశ్రీ రేలంగి వెంకట్రామయ్య మళ్ళీ ఈ చిత్రంలో వెండితెరమీద సాక్షాత్క-

రించి ప్రేక్షకులకు కనువిందుగ కావించనున్నారు

నటీనటవర్గం సావిత్రి కృష్ణం రాజు, విజయనిర్మల, ప్రభాకరరెడ్డి రాజ నాల, అల్లు రామలింగయ్య ఛాయాదేవి, మీనాకుమారి పి వెంకటేశ్వరరావు, గోకిన రామారావు, ఆనందమోహన్, ప్రముఖ స్టేజి నటుడు తారా కృష్ణ, ఆర్జా జనార్ధనరావు మ స్టర్ సతీష్ మొద లైనవారు ముఖ్య భూమికలను ధరించ నున్న ఈ చిత్రంలో ప్రముఖ హాస్య చక్రవర్తి రేలంగి వెంకట్రామయ్య, తమిళ, తెలుగు ప్రేక్షకునను ఏకధాటిగా నవ్వించగల నవ్వుల నటుడు న గే ష్ చక్కని హాస్య పాత్రలను పోషిస్తు న్నాడు.

సాంకేతిక వర్గం కధ టి వి బాబు, సంభాషణలు మోదుకూరి జా న్స న్ సంగీతం కోదండపాణి కెమేరా సుఖ దేవ్ కళ కళాకార్ కూర్పు అంకిరెడ్డి మేకప్ చక్రపాణి, కాస్ట్యూమ్స్ వెంకట రావు, ప్రొడక్షన్ యం వి. రామా రావు కో-డైరెక్టర్ ఇ మోహనదాస్ సహకార దర్శకులు వి విద్యాసాగరరెడ్డి, సత్యం నిర్వహణ డి, పార్థసారధి

దర్శకత్వం బి. వి ప్రసాద్

నిర్మాతలు . సావిత్రి. టి, వెంకట రత్నం, పి. సుబ్రహ్మణ్యం.

## బంగారు మనసులు

కె యస్ ఆర్, పిక్చర్స్ వారి "బంగారు మనసులు" చిత్రం పూర్తయి రీరికార్డింగ్‌కు సిద్ధమౌతున్నది ప్రముఖ నవలా రచయిత శ్రీ కృష్ణమోహన్ రచ నలో అతి సర్వాంగ సుందరంగా తయా రయిన ఈ చిత్రంలో నాయకిగా జమున ఇంతవరకూ ప్రేక్షకులు ఊహించని విధంగా నటించి తన పాత్రకు న్యాయం చేకూరుస్తూ జీవంపోశారు ఈచిత్రంలో యింకో చెప్పుకోదగ్గ విశేషం- వి లన్ పాత్రలకే అంకితమైపోయినట్లుగా ఊహిం చబడుతున్న సత్యనారాయణ ఇంతవరకూ కనీ వినీ ఎరుగని క్రొత్త తరహాపాత్రను పోషించారు ఆయన నటనా కౌశల్యానికే ఆంధ్రప్రేక్షకులు ఆశ్చర్యపోక తప్పదు

రెండు నర్క్రొత్త తరహా పాత్రలతో విశాలాంధ్ర అంతటా త్వరలో విడుదల కాబోతున్న ఈచిత్రం సాహితీరంగంలో వినూత్నను సృష్టించబోతున్నది డిటె క్టివ్ సాహిత్యంలో పేరు ప్రఖ్యాతులు గడించిన శ్రీ కృష్ణమోహన్ రచనను ఆదరించి అత్యంత ప్రయాసల కోర్చి చక్కని చిత్రంగా రూపుల దిద్దిన దర్శక నిర్మాత శ్రీ కె. ఎస్. రెడ్డి అభినంద నీయులు?

అగ్రశ్రేణి సంగీత దర్శకునిగా పేరు గడించిన శ్రీ సత్యం ఈ చిత్రంలోని ఆరుపాటలకు జీవం పోశారు. ఆరు



ఎస్. వి. ఎస్. వారి "డబ్బుకు లోకం దాసోహం" లో
జమున, ఎన్. టి. రామారావు.

పాటలూ ఆణిముత్యాల్లాంటివే. సందేహం లేదు. ఛాయాగ్రహణంలో సిద్ధహస్తులైన శ్రీ కన్నప్ప ఈ చిత్రానికి ఛాయాగ్రహకులు.

ఈ చిత్రంలో యింకా రాజసులోచన, చంద్రమోహన్, అల్లు రామలింగయ్య, త్యాగరాజు, కె. వి. చలం లీలారాణి, రామదాసు, మాగోపి, ఛాయాదేవి, మీనాకుమారి, శ్రీరంజని (జూ). బేబీ గౌరి, భూసారపు వెంకటేశ్వరరావు. అంజిబాబు. వేళంగి, వెంకటేష్ అప్పారావు. సుశీల, మంజుల, సుజాత నటీ నటులు. కృష్ణకుమారి అతిథినటిగా కనుపిస్తారు. అసోసియేట్ దర్శకుడు : కె యస్. ప్రసాదు.

ఆంధ్ర శ్రీ లక్ష్మీనారాయణ ఫిలింస్, సీడెడ్ జయలక్ష్మి పిక్చర్స్, నైజాం ఉషా ఫిలింస్; మైసూర్ నటేష్ మూవీ ఎంటర్‌ప్రైజర్స్ ద్వారా విడుదల.

జీ వి త ం

శ్రీయుతులు సూర్యచంద్రరావు, గిరిబాబు గారలు శ్రీధర్ ప్రొడక్షన్స్ బ్యానర్‌లో నిర్మిస్తున్న చిత్రం "జీ వి త ం" సెన్సారు పూర్తిచేసుకొని, విడుదలకు సిద్ధంగా వున్నది. ఈ చిత్రంలో పసం



పూర్ణా మూవీస్‌వారి "స్త్రీ" లో చంద్రకళ

దయిన ఐదుపాటలున్నాయి. రెండు పాటలు చక్కని ఔట్‌డోర్ దృశ్యాలతో చిత్రీకరించారు ఇన్‌డోర్‌లో చిత్రీకరించిన మిగిలిన మూడు పాటలలో ఒకపాట వయ్యారి నాట్యతార జ్యోతిలక్ష్మిపై చిత్రీకరించబడింది

జీవితంయొక్క పరమార్ధమేమిటో తెలియజెప్పే ఈ చక్కని సాంఘిక చిత్రంలో శోభన్‌బాబు, శారద, జయంతి కృష్ణంరాజు జ్యోతిలక్ష్మి బేబి డాలీ ముఖ్యపాత్రలలో కనుపిస్తారు

సుప్రసిద్ధ దర్శకులు శ్రీ కె యస్ ప్రకాశరావ్ దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రానికి మాటలు భమిడిపాటి రాధాకృష్ణ. సంగీతం రమేష్‌నాయుడు కూర్పు బి. గోపాలం, కెమెరా సత్యనారాయణ, సహకార దర్శకుడు కె. రాఘవేంద్రరావు సహాయ దర్శకుడు వి సత్యనారాయణ రెడ్డి లక్ష్మి ఫిలింస్ విడుదల

## విశ్వభారతి ద్వితీయ చిత్రం

విశ్వభారతివారి రెండవ చిత్రం తాలూకు రికార్డయిన మూడు పాటలను

వరి ఒకటినుండి ఏడవ తేదీ వరకు మైసూర్ బృందావన్ గార్డెన్స్ లాల్ బాగ్ మొదలైన రమణీయ ప్రదేశాలలో అక్కినేని నాగేశ్వరరావు, లక్ష్మి కృష్ణం రాజు, జయకౌశల్య, రాజ్‌బాబు, రమా ప్రభలపై చిత్రీకరిస్తారు

వి మధుసూదనరావు దర్శకత్వంలో తయారవుతున్న ఈ చిత్రంలో యింకా గుమ్మడి, అంజలి సూర్యకాంతం, సాక్షి రంగారావు, సారధి కె వి, చలం, ధూళిపాళ, కాంచన (జూ) మొదలగు వారు నటీనటులు

నవయుగ ద్వారా విడుదలకానున్న ఈ చిత్రానికి సంగీతం టి, వి చలపతిరావు, సంభాషణలు బొల్లిముంత శివరామకృష్ణ కెమెరా సెల్వరాజ్, కూర్పు శ్రీ హ రి, నిర్మాత జి రాధాకృష్ణమూర్తి.

## అజన్మ బ్రహ్మచారి

సుప్రసిద్ధ దర్శకుల జాబితాలో ఒక రుగా నిలిచిపోయిన హాస్య నటుడు శ్రీ పద్మనాభం రేఖా అండ్ మురళి బ్యాన ర్‌లో నిర్మిస్తున్న "అజన్మ బ్రహ్మచారి" హాస్య చిత్రం పూర్తయి అతి త్వరలో విశాలాంధ్ర అంతటా లక్ష్మి ఫిలింస్ ద్వారా విడుదల కాబోతున్నది

ఫుల్‌లెంగ్త్ కామెడీతో నిర్మించిన ఈ చిత్రం ప్రేక్షకుల ఆదరాభిమానాలు పొందగలదు అడుగడుగునా కడుపుబ్బ



వాసంతి సమర్పించు శ్రీ కల్ప నాలయా వారి ప్రొడక్షన్ నెం-2 లో క్రొత్త తరహా పాత్రలో జమున.

నవ్వించే సన్నివేశాలు ఈ చిత్రంలో కోకొల్లలు

స్క్రీన్‌ప్లే, దర్శకత్వం శ్రీ పద్మ నాభం వహిస్తున్న ఈ చిత్రంలో నాగ భూషణం, పద్మనాభం రామకృష్ణ, కె వి. చలం రాజబాబు, గీతాంజలి, రాజసులో చన, లీలారాణి రాధాకుమారి ము ఖ్య పాత్రధారులు



అన్నపూర్ణ కంబైన్స్ వారి "శారద"లో శోభన్‌బాబు.

శ్రీ వి పురుషోత్తం నిర్మిస్తున్న ఈ చిత్రానికి మాటలు పద్మరాజు, అప్పలాచార్య. సంగీతం కోదండపాణి, కెమెరా సత్యనారాయణ.

విడుదల : లక్ష్మీఫిలింస్.

## రామరాజ్యం

ప్రముఖ దర్శక నిర్మాతలుగా పేరు గడించిన ఆదర్శ సోదరులు శ్రీయుతులు బాబూరావు. ప్రభాకర్‌గారలు అత్యంత రమణీయంగా చిత్రీకరించిన "రామరాజ్యం" మద్రాసులోని ప్రెస్‌వారందరికీ చిత్రాన్ని చూపించారు.

గ్రామ రాజకీయాల్లోని పట్టువిడుపులు ప్రతివారికీ అర్థమయ్యేట్లు యువదర్శకుడు శ్రీ బాబూరావు చక్కగా చిత్రీకరించారు ప్రతిషాట్‌లోనూ చక్కని వాతావరణం కల్పించి మేటి చిత్రంగా రూపొందించడంలో ఆయన ఎంత శ్రమ తీసుకున్నారో స్పష్టీకృతమౌతుంది చిత్రం ప్రారంభించేముందు దాదాపు సంవత్సరం పాటు ఎంతో ఆసక్తితో పేపరు వర్కు ముగించిన ఆయన కృషి రాణించిందీ చిత్రంలో. చక్కని టీమ్‌వర్కుతో. నటీనటుల సహకారంతో నిర్మించిన ఈ చిత్రం తప్పక ప్రజాదరణ పొంది తీరు



రమణ చిత్ర ఇంటర్ నేషనల్ వారి "దేవుడమ్మ"లో చలం.

---

తుంది ఇటువంటి చిత్రాలకోసమే ప్రజలు వేయి కళ్ళతో ఎదురుచూస్తున్న ఈ తరుణంలో "రామరాజ్యం" ప్రేక్షకులను ఆనందింపజేయగలదు

రామవిజేత బ్యానర్ లో నిర్మించబడిన ఈ చిత్రంలో జగ్గయ్య, ఎస్. వి. రంగారావు, గుమ్మడి చంద్రమోహన్, నూతన నటుడు శరత్ బాబు కె. వి. చలం.



మద్రాసు, మైలాపూరులో జరిగిన నేతాజీ 76 వ జన్మదినోత్సవ మహాసభకు అధ్యక్షత వహించిన గవర్నరు శ్రీ కె. కె. షాను పూలమాలా కృతుల్ని చేస్తున్న ప్రెస్టేజి కల్చరల్ ఎకాడమి వైస్ ప్రెసిడెంటు శ్రీ డి. జయశంకర్.

---

రాజ్‌బాబు, అల్లు రామలింగయ్య. ప్రభాకరరెడ్డి. సావిత్రి. చంద్రకళ. లీలారాణి. శో జారమణి ముఖ్యపాత్రధారులు.

లక్ష్మీఫిలింస్ విడుదల.

## జీవన తరంగాలు

ప్రముఖ నిర్మాత శ్రీ డి. రామానాయుడు నిర్మిస్తున్న "జీవన తరంగాలు" సాంఘిక చిత్రం "ఈ అందానికి బంధం వేశానొకనాడు" అని అతనంటే "ఆ బంధమే నా కందమైనదీనాడు...." అన్న ఆమె సమాధానంతో పూర్తయింది. ఈ పాటను జనవరి 30, 31 వ తేదీలలో మైసూరు బృందావన్ గార్డెన్స్‌లో వాణిశ్రీ. శోభన్‌బాబుల పై అత్యంత సుందర రమణీయ ప్రకృతితో చిత్రీకరించారు దర్శకులు శ్రీ తాతినేని రామారావు.

సంగీత దర్శకులు శ్రీ జె. వి. రాఘ



రేఖా అండ్ మురళి వారి "అజన్మ బ్రహ్మచారి"లో నాగభూషణం.

వులు సంగీత సారధ్యం వహిస్తున్న ఈ చిత్రంలో మొత్తం ఏడుపాటలున్నాయి.

ప్రముఖ నవలా రచయిత్రి శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి కథ ఆధారంగా నిర్మిస్తున్న ఈ చిత్రంలో శోభన్‌బాబు, గుమ్మడి, చంద్రమోహన్, కృష్ణంరాజు, త్యాగరాజు, పద్మనాభం, రమణారెడ్డి, రావి కొండలరావు, వాణిశ్రీ, లక్ష్మి, సూర్యకాంతం, లీలారాణి, జూనియర్ శ్రీరంజని, నల్లరామ్మూర్తి, సీతారాం ముఖ్య తారాగణం.

నవయుగ ఫిలింస్ద్వారా విడుదలకాబోతున్న ఈచిత్రానికి సంభాషణలు ఆత్రేయ, పి. శెట్టి, పాటలు ఆత్రేయ, సి. నారాయణరెడ్డి, దాశరధి, కూర్పు మార్తాండ్, కెమెరా యస్ వెంకటరత్నం కళ ఎస్. కృష్ణారావు, అసోసియేట్ డైరెక్టర్ చెరువు ఆంజనేయశాస్త్రి సాంకేతిక నిపుణులు.

# యాజమాన్యం తదితర వివరాలు

## "జ్యోతి"

ఫారం 4 (8 వ నిబంధన ప్రకారం)

| | | |
|---|---|---|
| ప్రచురణ స్థలం | : | మద్రాసు |
| ఎంతకాలానికొకసారి | : | మాస పత్రిక |
| ముద్రాపకుని పేరు | : | టి. వి. నరసింహారావు |
| జాతి | : | భారతీయుడు |
| విలాసం | : | 7, నాగేశ్వరరావు రోడ్, మద్రాసు-17. |
| ప్రకాశకుని పేరు | : | శ్రీమతి వి. లీలావతి |
| జాతి | : | హిందు |
| విలాసం | : | 7A శివాజి స్ట్రీట్, టి. నగర్, మద్రాసు-17. |
| సంపాదకుని పేరు | : | శ్రీమతి వి. లీలావతి |
| జాతి | : | హిందు |
| విలాసం | : | 7A, శివాజి స్ట్రీట్, టి. నగర్, మద్రాసు-17 |
| పత్రిక యజమానులు | : | శ్రీమతి వి. లీలావతి 7A, శివాజి స్ట్రీట్, టి. నగర్, మద్రాసు-17. |

పై విషయాలు నాకు తెలిసినంతవరకు వాస్తవమైనవని తెలియచేయుచున్నాను.

మద్రాసు-17 [సం] వి. లీలావతి

## పుస్తక సమీక్ష

**మహతి-వ్యాస సంకలనం-ప్రచురణ: యువభారతి, 6 కింగ్స్‌వే, సికింద్రాబాదు-3 వెల-20 రూ.**

స్వాతంత్ర్యానంతరం తెలుగువారి సంస్కృతిని సాహిత్యాన్ని సమీక్షించే నూరు వ్యాసాల సంకలనాన్ని ప్రచురించడమనేది ఏ విశ్వవిద్యాలయమో చెయ్యగలిగినపని. అటువంటిది పరిమిత వనరులూ, అవకాశాలూగల ఔత్సాహికుల సంస్థ. యువభారతి యిలాంటికృషి జరపడం ఎంతో అభినందనీయం. ఈ కార్యనిర్వహణకు యువభారతి కార్యకర్తలు పడ్డ కష్టవిషూరాలను తొలిపలుకులో వివరించారు. తెలుగువారు ఎందుకిలా ప్రవర్తిస్తారో అర్థం కావడంలేదనీ వాపోయారు. మేధావులు మన్నుతిన్న పాముల్లా నిర్వీర్యులైనారనీ. ఎందుకొచ్చిన స్వాతంత్ర్యం అంటూ మొహాలు వేలేసుకుని వున్నారనీ నిజం చెప్పేరు దీనంతటికీ కారణం ఆర్థికవ్యవస్థ అనీ దాని నంటిపెట్టుకుని వున్న సాంఘిక వ్యవస్థ అనీ. అది మారితేగాని పరిస్థితులు మారవనీ. కాబట్టి నూతన సమాజ నిర్మాణానికి దోహదమయే సాహిత్యాన్ని ప్రోత్సహించడం అందరి ఆశయం కావాలనీ చెప్పినట్లయితే సాహిత్యంలోంచి రాజకీయాల్లోకి వెళ్లిపోతున్నావేమోననే భయం కలగవచ్చును ఏది ఏమైనా యువభారతి వారికృషి హర్షణీయం. చేతులు ముడుచుకొని కూర్చునే కంటె ఏదో ఒకటి చెయ్యడం మంచిది కదా.

ఈ సంపుటిలో కొందరు ప్రసిద్ధ రచయితల వ్యాసాలు మహతికి న్యాయం చేకూర్చేవిగా వున్నాయి. ఉదాహరణకు. యువతరం-కవిత. సమాజంమీద సినిమా ప్రభావం, స్వాతంత్ర్య యుగోదయంలో తెలుగు కవిత. తెలుగు సాహిత్యం మార్క్సిజం ప్రభావం. తెలుగు నవల నరికొత్తపోకడలు మొదలగు వ్యాసాలు విషయజ్ఞానంతో శ్రద్ధగా వ్రాసినవి కావడంవల్ల వర్ధమాన యువరచయితలకు విజ్ఞానదాయకంగా వున్నాయి కాని మరికొందరి వ్యాసకర్తలసాహిత్య పరిజ్ఞానం నిజానికి స్వాతంత్ర్యానంతరం నిలచిపోయినటుగా సందేహం కలుగుతుంది. వారు ఇటీవల తెలుగు సాహిత్యంలో వచ్చిన పోకడలను గాని, సాహితీ స్రవంతిని ప్రభావితం చేసినవారి రచనలనుగాని శ్రద్ధగా పరిశీలించినటులేదు ఉదాహరణకు "పత్రికలు, కథలు" అనే వ్యాసంలో స్వాతంత్ర్యానంతరం వెలువడిన ముఖ్యమైన పత్రికలు, అవి కథాసాహిత్యానికిచ్చిన ప్రాముఖ్యము కథాసాహిత్యాన్ని కొత్తమలుపు తిప్పిన ఉత్తమ కథలు. మొదలైన విషయాలగూర్చి వివరంగా వ్రాయలేదు. ఇలా కొన్ని ముఖ్య విషయాలను విస్మరించి నేలవిడిచిన సాముచేసిన వ్యాసాలు కొన్ని కనిపిస్తాయి మనకి

ఇలాంటి అసమగ్ర రచనలకు బాధ్యులు రచయితలే అయినప్పటికీ. నూరు వ్యాసాల సంఖ్య పూర్తి కావడమనేది కాకుండా. ఉత్తమ రచనల సంకలనం వేయడమనేదే యువభారతివారి లక్ష్యమై ఉంటే బాగుండేది ఉత్సాహవంతులతో కూడిన యువభారతి యీ లక్ష్యంతో ముందు ఉత్తమ సాహిత్యాన్ని మరింతగా వెలువరించి సాహిత్యసేవ చేయగలదని ఆశిస్తాము.

డా. సూ

JYOTI-
REGD NO 8669
NO.14/71(N.P&P)




# దేశోద్ధారకులు

ఈస్టమన్‌కలర్

నిర్మాత: U. విశ్వేశ్వరరావు, బి.కాం; దర్శకత్వం: C.S.రావు, B.A.(Litt.)
సంగీతం: K.V.మహదేవన్; కెమేరా: G.K.రాము - కళ: S.కృష్ణారావు